డిటర్జెంట్
వలన దుస్తులు కేవలం
స్వచ్ఛమవుతాయి



రానిపాల్
వలన అవే దుస్తులు ధగధగ
తెల్లగా అవుతాయి



## అందువలన ప్రతి సారి డిటర్జెంట్‌తో ఉతికిన తరువాత దుస్తులను రానిపాల్ కలిపిన నీటిలో ముంచండి



**రానిపాల్-సర్వోత్తమ తెలుపు కోసం**




రానిపాల్
నూలు దుస్తులకు




రానిపాల్-ఎస్
సింథెటిక్ మరియు
మిశ్రమ దుస్తులకు

ఈ సైజులలో లభించును: రానిపాల్-1 గ్రామ్,
5 గ్రాములు, 100 గ్రాములు. రానిపాల్-ఎస్-20 గ్రాములు

Shilpi SGCD 4/82 Tel

సంస్థాపకులు
వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
లీలావతి రాఘవయ్య

సంపుటి 20 | సెప్టెంబర్ 1982 | సంచిక 8

# ఇదీ వరస...



ఈ నెల నవలానుబంధం

## ప్రేమ - పెళ్లి

రచన

**విం ధ్య వా సి ని**

**జ్యోతి, పి. బి. నెం. 1824, హైదరాబాదు-20**

ముఖచిత్రం : ఎన్. టి. ఆర్. వెనక : స్వప్న.

# "మమ్మీ, ఈ దురద, మంటను ఎలాగైనా ఆపవూ."









2 రకాల
డబ్బీలలో
దొరుకుతుంది.
'నీలం' మరియు
'చందనం.'

**నైసిల్**
తెచ్చుకోండి
చెమటకాయల
బాధ మరిచిపోండి.



ఔషధ యుక్త-నైసిల్
1. అధికమైన చెమటను నిరోధిస్తుంది.
2. చెమటను పీలుస్తుంది.
3. దుర్గంధాన్ని కల్గించే సూక్ష్మ జీవులను నాశనం చేస్తుంది.
4. చర్మమునకు హాయి గొలుపుతుంది.

# తొలిమాట



# CEASE FIRE!

స్వాతంత్ర్య దినం దగ్గరి కొచ్చేసింది-మనకి స్వాతంత్రం, స్వేచ్ఛ వున్నట్టు గుర్తుచేసే రోజు. స్వేచ్ఛ సంగతి మనకి తెలిసిందే! ఇక ఉత్సవాలు వరిపాటే స్వాగతోత్సవాలు, వీడ్కోలు ఉత్సవాలు ఢిల్లీలో నూతన రాష్ట్రపతి శ్రీ జ్ఞాని జైల్‌సింగ్‌కు స్వాగతం-శ్రీ నీలం సంజీవరెడ్డికి వీడ్కోలు-శ్రీ సంజీవరెడ్డి ఉన్నత బాధ్యతని జాగ్రత్తగా నెరవేర్చి అందరి మెప్పు పొంది రాజకీయ విశ్రాంతి తీసుకుంటున్నారు.

○ ○ ○ ○

విప్లవాన్ని చాలామంది తమ చేతలకు దూరంగా ఉంచాలనే చూస్తారు, వ్యాపార సరళి అనుసరిస్తారు.

కానీ విప్లవాన్ని చేతల్లోనూ, నిజ జీవితంలోనూ చూపిన బహు కొద్దిమందిలో అతి ముఖ్యుడు శ్రీ చెరబండ రాజు....అలని నిదు రించారు. జ్యోతి ఆ మహారధికి నివాళులు అర్పిస్తున్నది.

## జ్యోతి-భాగ్యలక్ష్మి లాటరీ కథల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన కథ

# జీవిత పోరాటం

మూసివున్న కను రెప్పలు.

నరాలులేచి కనుపాపలు కదిలి, మెల్లిగా కళ్ళు తెరుచుకుంటున్నాయి

గాలికి తలుపు తెరుచుకుంటున్న దృశ్యం.

గడపదాటేసి దూసుకు వస్తున్న వెలుగు.

శుభ్రమైన కన్ను. మధ్యలో నల్లని గుడ్డు. కనుగుడ్డు గోళం లాగా అయ్యి తనచుట్టు తాను తిరుగుతోంది. గోళం నిండా సముద్రం. ఖండాలు. ఖండాలు కత్తిరించినట్టు దేశాలు దేశాల్ని ముక్కలు కోసినట్లు రాష్ట్రాలు. గోళం తిరుగుతోంటే సముద్రపు అలలు.... వృక్షాలు, జంతువులు, పొలాలు, వూళ్ళు, అనాగరికులు, ఎడారులు, నగరాలు, నాగరికులు, గుట్టలు, లోయలు....

సముద్రపు అలలు....గోళం మెల్లగా తిరుగుతోంది.

ఐరోపా, ఆఫ్రికా, ఉత్తర అమెరికా, దక్షిణ అమెరికా, ఆస్ట్రేలియా, ఆసియా ఆసియా దక్షిణంలో పూర్తి చివరికొనన భారతదేశము.

వ్యవసాయ దేశంలాగా ఆకుపచ్చ రంగులో భారతదేశం ఆకుపచ్చ రంగు మారి నల్లని చుక్కలు కనిపిస్తున్నాయి. చుక్కలు మెల్లిగా కదులుతున్నాయి. నల్లని చుక్కలు మనుషుల తలలవుతున్నాయి. ముఖాలు కనిపిస్తున్నాయి. బరువుల్తో, బాధ్యతల్తో కృంగి కృశిస్తున్న మనుషులు. కోట్లకు కోట్లే. గజిబిజిగా సందులేకుండా... ....పీక్కుపోయిన ముఖం, కింద చిన్న మెడ, బొమికలు తేలిన రొమ్ము, భుజాలు. అతుక్కుపోయిన డొక్క. చింకి పంచె కట్టెపుల్లలా కాళ్ళు, కాళ్ళకు బలమైన ఇనుప గొలుసులు. వెనక్కిలాగి చేతులకు వేసిన బేడీలు. భారద్దేశపటం మీద హింసింపబడుతూ వున్నట్టు సామాన్యుడు అతికించినట్టున్నాడు. అతని చుట్టూ చూసి

దేవరాజు మహారాజు

నంత దూరం అతనిలాంటి వాళ్ళే-ఇనుప గొలుసుల్తో కట్టివేయబడ్డ మనుషులు!!

o o o o

చేతిమీద ఏదో వస్తువు పడింది. ఆ వస్తువేదో ఆలోచనలమీద పడ్డట్టయ్యింది. మగతలోంచి లేచి చూసుకున్నాడు గ్లోబ్ లాగా గుండ్రని బంతి. భూమి లాగా గుండ్రని బంతి.

"నాన్నా నా బాల్...."

యాదవరెడ్డి తల తిప్పి చూసాడు. రోహిణ్ కనిపించాడు బంతికోసం వాడు మంచంచుట్టూ తిరుగుతున్నాడు

"ఇదిగో- దూరంపోయి ఆడ్కో."

బంతిచేతిలోకొచ్చిన మరక్షణమే రోహిణ్ ఎగురుతూ ఆ గదిలోనే మరో మూలకు పరిగెత్తాడు. వాడి చిన్న చేతుల నిండా గుండ్రని బంతి బంతి చుట్టూ నిలువు గీతలు. ఎర్రవి నీలంవి నల్లవి... బంతి. భూమి బంతి.

కేవలం తలనొప్పే కాదు. ఒళ్ళంతా నొప్పిగా వుంది. విధి నిర్వహణలో గత రెండ్రోజులుగా సరిగా నిద్రలేదు అలసట తీరలేదు. కళ్ళను కుట్టేసే ప్రయత్నం చేస్తోంది నిద్ర. గదంతా వేడిగా వుంది. కిటికీలోంచి దురాక్రమణ చేసిన ఎండ గదంతానిండింది. బయట ట్రాఫిక్ చప్పుడు కొద్దిగా వినిపిస్తోంది. గదిలోకి కిటికీకి అవతలి వైపు బండివాని గొంతు వినిపిస్తోంది. మంచి పోతున్న ఉల్లి గడ్డలూ, ఇతర కూరగాయలూ అమ్ముతున్నట్లుంది.

"చిన్నదూ అమ్మేదిరా?"

"ఊఁ-"

"అమ్మ!- అమ్మెటు పోయిందిరా?"

"ఊఁ- ఇగో-అమ్మ... అమ్మనా?.... అమ్మా... ఇంగ అన్నయ్య బజారుకు పోయి ర్రి-" అతి స్పష్టంగా చెప్పి అవి తానందాన్ని పొందాడ రోహిణ్.

కిరోసిన్ క్యూలు, చక్కెర క్యూలు కళ్ళముందు కదలాయి తనో సగటు మనిషి రేషన్ కోసం పరిగెత్తే త్యాగం ....ఏదో జ్ఞాపకాని కొచ్చింది షాకొట్టిన వాడలా లేచాడు. టైం చూసుకున్నాడు-మూడయ్యింది హడావుడిగా తయారయ్యాడు. అప్పటికే పదిహేను నిముషాలు గడిచేయి. సుమారు గంటలోగా పత్రికాఫీసులో వుండాలి.

"ఒరేయ్ తలుపేసుకో"- రోహిణ్ పరిగెత్తుకొచ్చాడు. కాని ఒంటరిగా వుండలేనని కాబోలు కళ్ళనిండా భయం నింపుకున్నాడు "భయపడకు అమ్మొస్తుందొచ్చు ..రాత్రి కొచ్చేప్పుడు చాక్లెట్లు తెస్తానేం ఏడవకూ-" ఓదార్పు మాటల్ని వెనక కాస్తూ పుటే అడుగులు ముందుకు పడుతున్నాయి. ఆయింటి ముందు నుండి చిన్న రోడ్డున కలిసింది. చిన్నరోడ్డు సాగిసాగి మెయిన్ రోడ్డులో కలిసింది. బస్సు కనిపిస్తే పరిగెత్తి అందుకున్నాడు మెల్లగా కదిలోంది బస్సు. మూడు బస్సుల్లో ఎక్కాల్సినవాడు ఒక్క బస్సులో కూరుకుపోయారు. ఐదు నిముషాలకో బస్సు ఏర్పాటయినట్టు పత్రికలో రాసింది తనే.

ఒకప్పటి యాదవరెడ్డి, కేవలం యాదవ్‌గా మారిన ఇప్పటి యాదవరెడ్డి బస్సుకు వ్రేలడుతున్నాడు బతుక్కు వేలాడుతున్నట్టు! బస్సు నుండి రాలితే బతుకునుండి రాలిపడ్డట్టే అనుకున్నాడు. రెండు మూడు నిముషాలు పెనుగులాడి




అతికష్టంమీద బస్సులోకి చేరగలిగాడు. పైనవుండే ఐరన్‌రాడ్‌ను పట్టుకొని కిటికీలోంచి బయటకు చూసాడు. కిటికీలోంచి వచ్చే చల్లగాలి హాయిగా వుంది. కిటికీ పక్కనే కూచున్నతనికి బోడిగుండు వుంది. నల్లగా బక్కగా పిల్లిగడ్డంతో అనాగరికంగా వున్నాడు. జనుముతో తయారైన మామూలుమఫ్లర్ మెడచుట్టూ చుట్టుకున్నాడు. కిటికీఅద్దం దించే ప్రయత్నం చేస్తున్నాడు బస్సు కదుల్తోంది. బస్సులోని కిటికీ, కిటికీలో దృశ్యాలు కదులుతున్నాయి. రోడ్డు పక్కనే దుకాణాలు, హోటలు, చెత్తకుండీ, వనమహోత్సవం నాడు చెట్లు నాటినారసిడానికి గుర్తుగా వున్న ఇనుప జాలీలు, సినిమా హాలును కప్పేసిన బట్టలేని హీరోయిన్ బొమ్మ, ఉచ్చలతో నానిన పిట్టగోడ, మిరపకాయ బజ్జీల బండి, వేరుశనక్కాయల బండి, రోడ్డునిండా ఒకరివెంట ఒకరు వడే ఆడవాళ్ళు, మగాళ్లు, అరటిపళ్ళబండి, సింగోడాబండి టాక్సీసైకిల్ దుకాణం. మటన్ షాపు, ఫర్నీచర్ దుకాణం, పెట్రోలు బంకు. పెట్రోలుకోసం అల్లరిచేస్తున్నవాహనాలు, ఎండలో శిలా విగ్రహాల్లా వాటి తాలూకు మనుషులు. అక్కడక్కడ సెక్సీక్వీన్స్‌లా వివిధ భంగిమల్లో వైన్‌షాపులు. వినయం ఒలికిస్తున్న బ్యాంకు.

కిటికీ దించే ప్రయత్నం విఫలమైంది. బోడిగుండతను యాదవ్‌ని తట్టిఅన్నాడు. "గీ అయినా ఉత్రాయించు సార్! గాలి గుసాయించి సతాయిస్తాంది" యాదవ్‌కు అర్థంకాలేదు. అయోమయంగా చూసాడు. అతను మళ్ళీ అదే వాక్యం అన్నాడు. విన్నవాళ్లు కొందరు తమలోతాము నవ్వుకున్నారు. ఆ భాష గురించి - అప్పటికి అర్థమైంది. అద్దం కిందికి దించమంటున్నాడని. అద్దం కిందికి దించాడు. అతను కృతజ్ఞత పూర్వకంగానవ్వాడు. నవ్వులో దగ్గుతెర. మఫ్లర్ నోటికడ్డంగా పెట్టుకున్నాడు.

పోస్టాఫీసు దగ్గర ఆగింది సిటీబస్సు

స్విచ్ ఆఫ్‌చేస్తున్నట్లు గాలి ఆగి ఉక్క... కండక్టర్ టికెట్లకోసం తల్లడిల్లి పోతున్నాడు అసలు నిలబడడమే కష్టంగా వుంది. తనో ఇద్దరిమీద నిలుచున్నట్లూ, తనమీదో నలుగురు నిలుచున్నట్టూవుంది.

"టాంక్‌బండ్ - ఒకటి" - అన్నాడు యాదవ్ అతనిచెయ్యి కండక్టర్ను చేరుకునేలా లేదు. మధ్యలో మరో పదిమంది వున్నారు. మధ్యలో నిలబడిన అతని ద్వారా టికెట్ కార్యక్రమం విజయవంతమైంది. హమ్మయ్య అనుకున్నాడు. బస్సులో అంత కిక్కిరిసిన జనంమధ్య-చచ్చిపోతున్నట్టుగా వుంది. ఒకరి కాళ్ళు ఒకరు తొక్కుతూవుంటే-బురదతొక్కుతున్నట్టుగా వుంది. ఒకరి వీపు ఒకరు చూసుకుంటూ, ఒకరి చెమట ఒకరు ఆనందిస్తూ ఒకరిజేబులొకరు కత్తిరిస్తూ ఒకరి వెనుక ఒకరు గోతులు తవ్వుకుంటూ ఒకర్నొకరు పొడుచుకుంటూ.. ఛ-ఛ, సమాజంలో బ్రతుకులాగే వుంది బస్సు ప్రయాణం. చూపు కిటికీ లోంచి బయటకు పొడిగిస్తే - చెత్తకుండివద్ద కుక్కలు గుడ్డపేలికకోసం కొట్లాడుకుంటున్నాయి ...అధికారంకోసం తన్నుకునే క్షుద్ర రాజకీయ వేత్తలు స్ఫురించారు.

"ఏంసార్ అట్లనవ్వుతారు? ఈవార్త చదివిన్రా ఏంది?" - అన్నాడు ముందు సీట్లో కూర్చుని పేపరు చదువుకొంటున్న వ్యక్తి. అతను అనే వరకూ యాదవ్‌కి తెలియదు తను నవ్వుతున్నసంగతి తెల్ల లాల్చీలో అతను శుభ్రంగా ఉన్నాడు.

"లేదులేదు-ఏదో జ్ఞాపక మొచ్చింది"

'అట్నా-గీపేపరు చదివిన్రేమో నను కున్న. ఇగోదు ఆఫీసులు రాత్రి పూట పెట్టి దినమంత మూసేసనరట దినమంత కుటుంబసభ్యులతో గడపడానికి షాపింగ్ చేసోకుడానికి వీలు గల్పిస్తున్నరట-" పెద్దగా బస్సులో ఎవరినీ పట్టించుకోకుండా నవ్వుతున్నాడు. యాదవ్ కూడా అసహ్యంగా పెదాలమీద నవ్వు కక్కుకున్నాడు. చరిత్రలో తుగ్లక్ పారం జ్ఞాపకం చేసుకున్నాడు. అతను చదువుతున్న పేపర్లో బస్సు కాలుతున్న ఫోటో వుంది. దానికి కొంచెం పైన "సైన్యం తిరుగుబాటు-" "డి. ఎ. కొరకు ఉద్యోగులు సమ్మె"- పెద్ద అక్షరాలతో శీర్షికలు కనిపించాయి. పేపరు చదువుతున్నతను పేజీ మళ్ళించాడు. అందులో లాఠీఛార్జిలో కార్మికుడు మరణిస్తే కోపోద్రిక్తులైన ప్రజలు పోలీస్ స్టేషన్ను ముట్టడించిన ఫోటో ఉపాధ్యాయులుకావాలని, పాఠ్య పుస్తకాలు కావాలని విద్యార్థుల ఆలజడి. "స్త్రీలకు రక్షణ కావాలి-అధిక ధరలు తగ్గాలి"-వేల మంది స్త్రీలు గవర్నరుకు సమర్పించిన వినతిపత్రం "లారీ చెట్టుకు ఢీ" జపాన్‌లో కొత్త వంట పాత్ర-మారుమూల గ్రామంలో హత్య-కరువు ప్రాంతంగా నల్లగొండ బాక్స్ కట్టివేసిన మంత్రిగారి శుభాకాంక్షలు!!- పేపరు పెద్ద మనిషి బూతులు తిట్టుకుంటూ పేపరు మడతపెట్టాడు అతను దిగాల్సిన స్టేజీ వెనుక్కుంటున్నట్లు బయటకు చూస్తున్నాడు. స్టేజీ రాగానే డ్రైవర్ సడన్ బ్రేకు వేసాడు బస్సు ఒక ఊపు ఊగింది అంతకు ముందునుండే ఒకరి మీద ఒకరు పడివున్నారు గనుక ఆఊపు వల్ల ఎవరిమీద ఎవరూపడలేదు.




పేసరు పెద్ద మనిషి హడావుడిగా దిగిపోయాడు. దగ్గర్లోనే వున్న యాదవ్ కూచోబోయే లోపల మరొకతను విసురుగా రావడమూ, తోసేసినట్టే వెళ్ళి కూచోవడమూ జరిగిపోయాయి. అతను అత్యాధునికుడి లాగా సూట్లో వున్నాడు. చేతిలో హేండ్బ్యాగు. బస్సు మళ్ళీ బయలుదేరింది. పెద్ద శబ్దంచేస్తూ బరువుగా కదుల్తోంది "ఏమండీ-మీరే ఎక్కాలా లేదా?" బస్సు ముందు భాగంనుండి ఆడగొంతు వినిపించింది.

సమాధానంగా "ఆఁ-ఆఁ- ఎక్కాల్లేవే. పిల్లలు జాగ్రత్త!" - వృద్ధుడి బొంగురు గొంతు బస్సు వెనక భాగం నుండి వినిపించింది. బస్సులో కొందరు నవ్వుకున్నారు. అంత మందలో వాళ్ళిద్దరు ఎక్కడెక్కడున్నారో ఎలా వున్నారో యాదవ్ చూడలేకపోయ్యాడు. బయటకు చూస్తూ నిలుచున్నాడు. బద్ధకంగా కూచుని లంచాలు నెమరేస్తున్న ఒక ఆఫీసు కనిపించింది. ఆడబొమ్మల్తో ఆకర్షణలు వెదజల్లుతున్న బట్టల దుకాణాలు - మునిమునిగా నవ్వుకుంటున్న కిరాణా దుకాణాలు-జనరల్ స్టోర్స్-అందనంత ఎత్తు ఎదగిన వెండి బంగారపు దుకాణం - మూసివేయబడ్డ ప్రభుత్వ పాఠశాల-యువతరాన్ని దారి మళ్ళించే క్రికెట్ మ్యాచ్‌లు, హాకీ మ్యాచ్‌లు, చూపెడుతున్న స్టేడియం - పోలీసులు కాపలా కాస్తూ నడిపిస్తున్న ప్రయివేటు కళాశాల - అనాథల కోసం కట్టిస్తున్న ఫుట్‌పాత్ - రిక్షా జనానికి ప్రాణం పోస్తున్న కేఫే-అక్కడక్కడ కిళ్ళీకొట్లు - రోగుల్ని పంచుకుని పీక్కుతింటున్న ఆసుపత్రులు - విద్యార్థుల్ని, మేధావుల్ని, శ్రమజీవుల్ని ఉరికంబమెక్కిస్తున్న కోర్టు-కోటీశ్వరుల సంతతి న... వదిలీ, ప్రవర్తనకూ స్ఫురణకు తెన రోడ్డున అడ్డదిడ్డంగా తిరుగుతు... పశుపక్షులు - యూరినల్స్‌గానూ, ల

ట్రిలుగానూ ఉపయోగ పడుతున్న ఆట స్థలం-మేధావులు ప్రశ్నలు వేయకుండా కూచోబెట్టి వేల జీతాలిచ్చే యూనివర్సిటీ-చెప్పుల దుకాణం-ఆట వస్తువులదుకాణం రేడియో షాపు-ఫోటో సెంటర్ - బార్ అండ్ కేఫే-చిట్ (చీట్?) ఫండ్ఆఫీసు-ప్రయివేటు ఆసుపత్రి-క్షౌరశాల-బేకరీ-రెడీమేడ్ లకు లొంగని లాడ్జింగ్-పుస్తకాల దుకాణం-స్వీట్ హౌస్-మురికికాలువ ఓవర్ బ్రిడ్జి-రైల్వే లెవెల్ క్రాసింగ్ గేట్-నిర్మల్ బొమ్మలా అమర్చిపెట్టిన.. పళ్ళ దుకాణం మొదలయిన ఆరునెలలకే మూతబడిన పత్రిక ఆఫీసు-వాచ్ కంపెనీ-ఆప్టికల్స్ సెంటర్-జెరాక్స్ కార్నర్ - స్నాక్స్ అండ్ స్నాక్స్, కొన ఊపిరితో నడుస్తున్న ప్రెస్-ఆటోమొబైల్ షాపు-మ్యారేజ్ కార్నర్-ఖాళీ స్థలం-హోటల్-ఎయిరిండియా ఆఫీసు - నాలుగు రోడ్ల కూడలి-మురిగిపోయిన కళలకు సుగంధాలు రాని ప్రదర్శించేందుకు కట్టించిన ఆడిటోరియం-అధికారం కుర్చీ పాదాలు నాకుతున్న అకాడెమీ-అవకాశవాణి కేంద్రం-కుర్చీలెక్కి కూచున్న, జోగుతున్న, ప్రసంగిస్తున్న, గోలచేస్తున్న శాసనసభ-బస్సు ఆగుతోంది .. "ఈ రోజు ఇట్లా వుండగలుగుతున్నామంటే మన పటిష్టమైన ప్రణాళికలే ముఖ్యకారణం అని నేను మనవి చేస్తున్నాను. ఏదైతే ప్రతి పల్లె కూడా ముందుకువచ్చి మనయొక్క భవిష్యత్ ప్రగతి కార్యక్రమాలో పాలు పంచుకుంటుందో అట్లాగే ప్రతితాలూకా ప్రతి జిల్లా, ప్రతిరాష్ట్రంకూడాముందుకు వచ్చి ప్రగతి కార్యక్రమాల్లో పాల్గొంటాయోఅప్పుడు ప్రతియొక్క భాగదేశం కూడా ముందుకు పోతుందని నేను మనవి చేస్తూ వున్నాను. ఇక పోతే ఈ రకంగా మీకు సేవచేసే ఇలాంటి అవకాశం నాకు యిచ్చినందుకు నాయొక్క ... " తెలిసిన ముఖం కళ్ళముందుకొచ్చి పలకరించింది "హలో"-అన్నాడు యాదవ్. అంతకు రెండ్రోజుల క్రితంరాని పత్రికకుఅందించిన ఓ మంత్రిగారి అజ్ఞానపుఉపన్యాసం మెదడ్లో తిరగడం ఆగిపోయింది. పలకరించినతను మాట్లాడతాడేమో ననుకున్నాడు. మాట్లాడలేదు. ఇతను మరో వ్యక్తితో మాటల్లో పడ్డాడు శాసనసభ గోపురాలమీద పక్షులు రెట్టలువేసిన మరకలు కనిపిస్తున్నాయి.

ప్రజల తీర్పుకు హర్షం ప్రకటిస్తూ ప్రజలకు సేవచేయడమే తన ధ్యేయం అని గెలిచిన అభ్యర్థి చేసిన ప్రకటనను తానే రాసాడు. ఉచిత కల్లు సారా కుళాయిలు నిరంతరం ప్రవహింపజేసిజనాన్ని మోసంచేసి. డబ్బుతో మభ్యపెట్టి గెలవడం ప్రజాస్వామ్య విధానాలకు విరుద్ధం అని అన్న ఓడిపోయిన ప్రతిపక్షప్రత్యర్థి ప్రకటనను తానే రాసాడు బస్టాండ్ లో బస్సుకోసం ఎదురుచూస్తున్న యువతిని లాక్కొచ్చి డ్యూటీలోవున్న పోలీసులంతా కలసిరేప్ చేసారని ప్రజలుచేసిన ఆందోళన గురించి తనే రాసాడు ఆమె రేప్ చేయబడలేదని స్పృహ లేని స్థితిలో పడి వుండగా పోలీసులు హాస్పిటల్ లో చేర్పించారని పోలీసు ఉన్నతాధికారి వ్యాఖ్యానాన్ని తనే రాసాడు. జీతాలివ్వడంలేదని నిరాహార దీక్ష జరుపుతున్న వృద్ధ ఉపాధ్యాయ సంఘ ప్రతినిధి మీద లాఠీ ఉపయోగించారన్న వార్త తనే ప్రకటిం




వాడు వృద్ధాప్యంవల్ల చలి భరించలేక జబ్బు పడ్డాడన్న ప్రభుత్వ ప్రకటనను తనే తెలియజేసాడు.

బస్సు ఒక కుదుపులో మళ్ళీ ఆగింది. బయటకు చూస్తే - స్సు శాసనసభనుండి మధ్యలో మరో స్టేజీ కూడా దాటేసి వచ్చిందని తెలిసింది. ఇంకా కొద్దిదూరం పోతే సెక్రటేరియట్. బస్సు చుట్టూ గందరగోళంగా వుంది. బస్సులోని వాళ్ళంతా దిగుతున్నారు ఏమిటి? ఏమైంది? ఎవరూ జవాబు చెప్పరు. హడావిడి, కల్లోలం "జల్దీ ఉతర్ కే చలే జావో భై" కండక్టరు అరుపు. ప్రవాహంలో తనూ ఒక అణువై దిగి పోయ్యాడు యాదవ్. నిలదొక్కుకుని చుట్టూ చూసాడు రోడ్డంతా అస్తవ్యస్తంగా వుంది. ముందు చౌరస్తాలో బాష్పవాయువు ప్రయోగించారని, ఫైరింగ్ ఆర్డర్స్ కూడా వున్నాయని తెలిసింది. అక్కడ వుండడం మంచిది కాదు. బస్సు వెనక్కి మళ్ళుతోంది. ఎక్కడి వారక్కడే సందుల్లో గొందుల్లో దూరుతున్నారు. ఎదురుగుండా పోలీస్ వాన్ వేగంగా వస్తోంది. పాత బస్తీలో అల్లరయినప్పుడు తను ప్రెస్‌కు సంబంధించిన వాణ్ణని చెబుతున్నా వినిపించుకోకుండా పోలీసులు కొట్టిన దెబ్బలు. ఆతర్వాత హాస్పిటల్ అనుభవం జ్ఞాపకమొచ్చింది. మళ్ళీ రిస్క్ తీసుకోవాలా? ఆలోచించే సమయంలేదు కాళ్ళు అతని ప్రవేయం లేకుండా అక్కడి నుంచి కదిలాయి. పత్రిక ఆఫీసుకు చేరేది ఎలా?

యాదవ్ ఒక సందులో దూరాడ. అది ఘోరంగా వుంది. మురికి వాసన, బురద పెంకులు, అంతకు ముందు కొద్ది రోజుల క్రితం మతకలహాల కారణంగా కాల్చివేయబడ్డ దుకాణాలు, నల్లని మసి, బూడిద, కూలినయిండ్లు, అద్దంముక్కలు, చెట్ల కొమ్మలు, మట్టి రాళ్ళు... రెండు ఫర్లాంగులు పరిగెత్తితే చిన్నరోడ్డుకనిపించింది. అక్కడ కూడా పరిస్థితి బాగు

న్నట్లు లేదు. అందరూ యిళ్ళల్లోకి జొర బడతున్నారు. అక్కడున్న కిళ్ళీ కొట్లూ కేఫూ మూసుకున్నాయి తనముందు పరు గెడుతున్న వాళ్లు ఓమూలమలుపులో ఉన్న యింట్లోకి జొరబడ్డారు అతనూ అనుస రించాడు. లోనికెళ్ళగానే తెలిసింది. అది యిల్లుకాదు. చిన్న గ్రంథాలయం లైబ్రరీ హాల్లో చాలా మంది కనిపించారు. ఎవరో తన వెనకే తలుపు వేసేసారు. ఫ్యాన్లు తిరుగుతున్నాయి. టేబుళ్ళమీద పత్రికలు వణికి పోతున్నాయి. అందులో వున్న వాళ్ళంతా టేబుళ్ళు విడిచి కిటికీల దగర చేరారు. రోడ్డును ఆక్రమించుకుంటున్న పోలీసుల్ని చూస్తున్నారు.

తను అక్కడ కొంతసేపు గడపడం తప్పదు. ఆఫీసుకు ఫోన్ చేద్దామనుకు న్నాడు. కాని అక్కడ ఫోన్ కనిపించ లేదు. చుట్టూ చూసాడు. వరసగా అల మారాలు. అలమారాల గాజు అద్దాల్లోంచి బయటకు చూస్తున్న పాతవార్తాపత్రికలు, పుస్తకాలు....యాదవ్ మనసు పత్రికల్లో తిరుగుతోంది.

గని కూలి ఐదువందల మంది దుర్మ రణం. లారీ ప్రమాదంలో ఇద్దరిమృతి. కరువు, వరద, అతివృష్టి, అనావృష్టి, హెలికాప్టర్‌లో మంత్రుల సందర్శన, సానుభూతి, ఒక్కొక్కరికీ ఒక పంచె, అరకిలో బియ్యం పంపకం - హిందూ ముస్లిం కొట్లాటలు-రక్తపాతం-నిరాహార దీక్షలు-అభయ హస్తాలు-అడవిలో బండి ఆపి ధాన్యం ఎడ్లతో సహా దోచుకుపో వడం, హైజాకింగ్, ప్లేన్ కాలి కూలినా ఆయుస్సు నిండని రాజకీయ చిరంజీవి. ఉత్తర భారతంలో హోషియార్‌పూర్ గురుద్వారాలో పోలీసులు విధవరాలు ప్రీతం కౌర్ శరీరంతో ప్రయోగాలు- గంగాపూర్‌లో వరకట్నం మంటల్లో సజీవంగా కాల్చబడిన నవవధువు సీలం. రాజధానిలో ఇతర దేశాల నాయ కులతో శాంతి చర్చలు... లోక్‌సభలో ప్రవేశపెట్టిన బిల్లులు. గెలిచిన పార్టీలోకి దూకుతున్న పిల్లులు. జరిగిన మానభం గాల ఎంక్వయిరీ-దురాగతాలకు పాల్పడే అధికారులను శిక్షించాలని ప్రజల తిరుగు బాటు-నేపాల్ రాజు ఇండియాపర్యటన- 144 సెక్షను అమలు - కర్ఫ్యూ-రైలు పట్టాలు పీకేసి ఫైళ్ళు తగలబెట్టిన సమా చారం-భారతీయ నర్తకికి మాస్కోలో అవార్డు - ఆకలికి ఆగలేక తన చంటి పాపను ఫ్రై చేసుకుని తిన్న తల్లి - ఆస్తి దక్కించుకోవాలని అన్నను చంపిన తమ్ముడు. నిజాలు బయటపెట్టినందుకు జర్నలిస్టు భార్య మానభంగం-ఖైదీల కళ్ళలో యాసిడ్....

యాదవ్ మనసు వికలమయ్యింది పక్కకు తిరిగాడు. అద్దాల నుండి హుందాగా కనిపిస్తున్న బైండ పుస్తకాలు. పుస్తకాలనిండా భయంకర సత్యాలు. మన షుల్ని చదివిన పుస్తకాలు. స్వేచ్ఛా గీతాలు పాడినందుకు శిక్షకు గురయిన మధురగాయకుడు పాల్ రాబ్సన్.నీగ్రోల హక్కులకోసం పోరాడి హింసకుగురైన ఎంజెలా డివిస్. పాస్‌పోర్టు రద్దు చేస్తే అమెరికా చేరలేని మహానటుడు చార్లీ చాప్లిన్. దేశం నుంచి బహిష్కరించబడ బెర్ట్రోల్డ్ బ్రెహ్ట్. అణ్వస్త్రాలను వ్యతిరే కించిన నేరానికి ఉరితీయబడ్డ రోజెన్‌బర్గ్

దంపతులు.

స్వేచ్ఛ? వ్యక్తిస్వేచ్ఛ? వాక్ స్వేచ్ఛ? పత్రికా స్వేచ్ఛ?... జైల్లో రచయితలు! జైల్లో కళాకారులు! జైల్లో మేధావులు!!

పుస్తకాలు మూసిపెట్టే వున్నాయి. పుస్తకాలు నిద్ర పోయినట్లే వున్నాయి. పుస్తకాల్లో తిరుగుబాట్లు, పుస్తకాల్లో ఉద్యమాలు, పుస్తకాల్లో యుద్ధాలు, పుస్తకాల్లో రక్త ప్రవాహాలు, పుస్తకాలంటే మానవ మస్తిష్కాలు-పుస్తకాలు మూసుకునే వున్నాయి. కానీ చరిత్ర? చరిత్ర తెరుచుకునే వుంది. చరిత్ర మేల్కొనే వుంది. చరిత్ర కుత కుత ఉడుకుతూనే వుంది.

యాదవ్ అసహనంగా కదిలాడు. కిటికీ దగ్గర నిలబడ్డ వాళ్లు కూడా అసహనంగా వున్నారు. జైలులో బంధించినట్టూ గుండెలోకి రక్తం పంపే నాళాలన్నీ తెగిపోయినట్టూ అనిపించింది. పత్రిక ఆఫీసు -ఉద్యోగం - అబద్ధాలకు పాలిష్ కొట్టి అమ్ముకునే పత్రికలకు విరుద్ధంగా జనానికి సరైన అవగాహన కలిగించే విధంగా తను, తన తోటి వాళ్ళూ ప్రయత్నించడం కనీస కర్తవ్యం. తనలాగే ఆలోచించేవాళ్ళు తనకుతోడు చాలామంది వున్నారు.

కాలం కడుపుమీద పెట్టబడుతున్న చురకలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. అద్దాలు నిజాన్ని చూపినట్లే-తనలాంటి వాళ్ళు పని చేయాలి. జనానికి నిజాల్ని చూపాలి, అయితే తను తనలాంటివాళ్ళూ నిజాల్లోకి దిగకుండా అడ్డుకునే అద్దం దగ్గర, కిటికీల దగ్గరా ఆగిపోకూడదు. దాటేసి పోతేనే సంఘర్షణలో పాలుపంచుకున్నట్లు-తప్పదు. ఈ జీవనపోరాటంలో తనూ ఒక ప్రధానభాగం కాక తప్పదు. కిటికీలోంచి బయటకు చూశాడు. బయట అంతగా పెద్ద మార్పేమీ వచ్చినట్లులేదు. పోలీసు జీపు చక్రాలచప్పుడు వినిపిస్తోనే వుంది.

లైబ్రరీ హాల్లోంచి ఎంతో ఆత్మస్థయిర్యంతో, కర్తవ్య నిర్వహణకోసం బయటకు నడిచాడు యాదవ్.

○ ○ ○ ○

వ్యవసాయక దేశంలాగా ఆకుపచ్చ రంగులో భారతదేశం, ఆకుపచ్చ రంగు మారి నల్లని చుక్కలు కనిపిస్తున్నాయి. చుక్కలు మెల్లిగా కదులుతున్నాయి. నల్లని చుక్కలు మనుషుల తలలవుతున్నాయి. ముఖాలు ముఖాలు కనిపిస్తున్నాయి. ఆలోచనలతో, ముఖాలు ఎర్రబడినై. వెనక్కి లాగి-వేసిన బేడీలను వడితిప్పి విరిచేసే ప్రయత్నం చేస్తున్నాయి. బలమైన యినుప గొలుసుల్ని లాక్కుంటూ ముందుకు అడుగులస్తున్నాయి కాళ్లు....వెనక మిగిలిపోతున్నాయి కాలి ముద్రలు, ఆ ముద్రల్ని వెతుక్కుంటూ అనుసరిస్తున్నారు - చిన్న పిల్లలు....



జ్యోతి కార్టూన్ పోటీలో తృతీయ బహుమతి పొందిన విడి కార్టూన్.




## కార్టూనిస్టు పరిచయం

పూర్తిపేరు పేరి సూర్యకామేశ్వరరావు. కార్టూన్లు గీస్తుండేది 'కామేష్' పేరుతో. మొదటి కార్టూన్ ప్రచురణ సినీ హెరాల్డ్ పత్రిక ద్వారా. ప్రస్తుత నివాసం హైదరాబాదు. ఉద్యోగం రాష్ట్ర హైకోర్టులో. 'ఆంధ్రప్రదేశ్ క్రోక్విల్ అకాడమీ' కార్టూన్ల పోటీలో నా కార్టూన్లు రెండు బహుమతులు గెలుచుకొన్నాయి. నాకు బహుమతినిచ్చి ప్రోత్సహిస్తున్న జ్యోతికి, ఎంపిక చేసిన న్యాయ నిర్ణేతలకు హృదయపూర్వక కృతజ్ఞతలు!



కార్టూన్ పోటీలో తృతీయ బహుమతి పొందిన
ఒకే అంశంపై వచ్చిన కార్టూన్లు

అంశం : కర్త, కర్మ, క్రియ

## కార్టూనిస్ట్ పరిచయం

నేను 1968 నుంచి కార్టూన్‌లు వేస్తున్నాను. మొదటగా కీ॥ శే॥ రాఘవయ్యగారు విజయవాడలో జ్యోతి వున్నప్పుడు నా కార్టూన్‌లు చాలా ప్రచురించి నాకు చాలా ప్రోత్సాహం ఇచ్చారు. తరువాత ఒక సంవత్సరంపాటు "జయశ్రీ" రామమోహనరావుగారు జయశ్రీ, శ్రీమతి పత్రికలు రెండిట్లోనూ నా కార్టూన్‌లు, ఇలస్ట్రేషన్‌లు ప్రచురించి చాలా ప్రోత్సాహం ఇచ్చారు. అప్పుడు నేను "GUPTA" అనే పేరుతో వేసేవాణ్ణి. కార్టూన్‌లమీద జీవనోపాధి వెళ్ళదుగనుక నేను కొన్ని సంవత్సరాలు తెరమరుగున పడి మెడికల్ హోల్‌సేల్ వ్యాపారం చేసుకుంటున్నాను. మళ్ళీ 1978 నుండి కార్టూన్‌లు వేస్తున్నాను అన్నిపత్రికలవారూ నా కార్టూన్‌లు ప్రచురించి ప్రోత్సాహం ఇస్తున్నారు. నేను ఆంధ్రప్రదేశ్ క్రోక్విల్ అకాడమి మెంబర్ని. నా అభిమాన ఆర్టిస్టు శ్రీ వడ్డాది పాపయ్యగారు. అభిమాన కార్టూనిస్టు శ్రీ బాపుగారు.

మీరు ఇలాంటి పోటీలు అప్పుడప్పుడు నిర్వహించి కార్టూనిస్టులకు సహాయ సహకారం, ప్రోత్సాహం ఇవ్వగలరని ఆశిస్తున్నాను.

ఎ. ఎ. ఎస్. గుప్త



# యండమూరి వీరేంద్రనాథ్

సీరియల్

# డబ్బు

# డబ్బు

( జరిగినకథ )

(టాటా వాలాతో లక్ష్మి నాటకీయంగా మాట్లాడి నెగ్గాలనుకొంది. షేర్లు అమ్మకానికి పెట్టించి-రామ్మోహనరావు అడ్డగించాడు ఫోన్‌లో. అక్కడ అడవిలో మీటింగు-బర్డ్ వాచింగ్‌లో గాంధీకి జ్ఞానబోధ-నిరాశతో తిరిగొచ్చిన గాంధీకి తన డబ్బు నష్టపోకుండా ప్రమాదం లేకుండా బ్యాంకులు జాతీయం చేయబడ్డాయి. రేడియో వార్తతోబాటు లక్ష్మి చెప్పింది - హారిక దూరంగా క్రీగంట చూసి తల తిప్పుకుంది.)

- ఇక చదవండి -

కారు వేగంగా నగరం వైపు సాగిపోతూంది వెనుక సీట్లో మౌనంగ కూర్చుని వున్నారు తండ్రీ కూతుళ్ళు. ఎవరి ఆలోచనల్లో వారున్నారు. మాట్లాడుకోలేదు.

మధ్యాహ్నం పదకొండయ్యేనరికి పల్లే పట్నమూ కాని ఒక మధ్యతరగతి వూరు వచ్చింది.

"టిఫెన్ తీనుకుంటావా" అని అడిగాడు రామ్మోహన్‌రావు

"వద్దు. అరిటిపళ్లు కొందాం" అంది హారిక.

డ్రైవర్‌కి డబ్బులిస్తూ "అలాగే పేపరూ పట్రా" అన్నాడు ఆయన. డ్రైవర్ వెళ్ళి రెండూ పట్టుకొచ్చాడు. కారు మళ్ళీ కదిలింది

పళ్ళు అందిస్తూ "తీసుకోనాన్నా" అంది హారిక.

"ఊహూ నాకొద్దు" అంటూ పేపర్ విప్పాడు. కారు ఇరుకు వీధులగుండా నెమ్మదిగా వెడుతోంది. దుమ్ము లోపటికి రాకుండా గ్లాసు పైకి ఎత్తించి హారిక.

పేపర్‌లో మొదటి పేజీలో పెద్ద అక్షరాల్తో పడిన వార్తని చూసి చప్పున ముందుకు వంగాడు రామ్మోహన్‌రావు

"శివకైలాస్ బ్యాంకుతోసహా ఆరు బ్యాంకులు జాతీయం"

వణికే చేతుల మధ్య పేపర్ రెపరెపలాడుతూంది. అక్షరాలు అల్లుకుపోయినట్టు కనబడుతున్నాయి

సీటు వెనక్కి వాలిపోయాడు.

హారిక ముందుగా గమనించలేదు. ఏందుకో పక్కకి తిరిగిచూసి ఆమె తండ్రి పరిస్థితి గమనించి- ఆందోళనతో 'నాన్నా' అంది. రామ్మోహనరావు మాట్లాడలేదు.

"డ్రైవర్ కారాపు"

కారు రోడ్డుపక్కగా ఆగింది. హారిక ముందుకు వంగి, తండ్రిమీద చెయ్యి వేస్తూ 'నాన్నా' అంది. రామ్మోహనరావు కళ్ళుతెరిచి కూతురివైపు చూశాడు. అతడి తలంలోంచి చెమట్లు ధారాపాతంగా కారుతున్నాయి.

"ఏమైంది నాన్నా"

"కొద్దిగా గుండెల్లో నొప్పిలాగా వచ్చిందమ్మా"

"గుండెనొప్పా....ఈ వూళ్ళో ఏదైనా ఆస్పత్రి అంటూన్న కూతురి మాటలకి నవ్వేడు. "ఇంత చిన్నదానికి ఆస్పత్రి ఏమిటమ్మా-డ్రైవర్ కారు తొందరగా పోనీ సాయంత్రం నాలుగింటికల్లా వూళ్ళో ఉండాలి"

ఆయన నాలుగింటికల్లా వూళ్ళో వుండాలనుకొన్నది డాక్టర్‌తో పరీక్షింప చేసుకోవటానికి కాదు

అంతకుముందురోజే టాటావాలా ఆయనకి ఫోన్‌చేసి, లక్ష్మి తనదగ్గరికి వచ్చిందనీ, బ్యాంకు షేర్లు అమ్ముతాననంటూందనీ అన్నపుడు ఆయన వాటిని కొనవద్దన్నాడు. ఇప్పుడు బ్యాంకు జాతీయంచేయబడింది.

అందే షేరు ధర పెరగబోతూంది.

ఈషేర్ల ధర పెరగడమూ-స్టాక్ ఎక్స్ఛేంజీల సంగతీ లక్ష్మికి తెలిసివుండదు. ఆమెకు సలహాలిచ్చే గాంధీ ఎక్కడో అడవిలో వున్నాడు. అతడు లక్ష్మికి ఫోన్‌చేసి షేర్లు అమ్మొద్దు అని చెప్పేలోపులో టాటావాలాని లక్ష్మిదగ్గరకి పంపి షేర్లు కొనిపించెయ్యాలి. అందుకే ఆయన డ్రైవర్‌ని తొందరగా నగరం చేరుకొనేలా డ్రైవ్ చెయ్యమంటున్నాడు. డబ్బుకన్నా ఆరోగ్యానికి ప్రాధాన్యత ఇచ్చేవాడు బిజినెస్ మాగ్నెట్ కాలేడు.

ఇలా ఆయన తొందరపడుతున్న సమయానికి లక్ష్మి అంతకన్నా స్పీడ్‌గా కార్లో ఎయిర్‌పోర్ట్‌కు వెళ్తున్నది. దానికి కారణం తెలుసుకోవాలంటే ఒక నాలుగు గంటలు వెనక్కి వెళ్ళాలి.

ప్రొద్దున్న ఏడింటికి లక్ష్మివచ్చి రేడియోపెట్టి వార్తలు వినిపించినప్పుడు ఉద్వేగంగా వచ్చిన సంతోష తరంగాల ఆనందంనుంచి తొందర్లోనే తేరుకున్నాడు గాంధీ. ఇదే మొత్తం గెలుపుకాదని అతనికి తెలుసు. అతడి మనసులో ఆలోచనలు జెట్‌కన్నా వేగంగా వెళ్తున్నాయి.

లక్ష్మి అంటూంది, "ఇంకానయం. తొందరపడి నిన్న షేర్లు అమ్మేసేంకాదు ఎంతో చింతించవలసి వచ్చేది" అని. ఆమె మాటలకి ఇంకోలా రియాక్టు అయ్యాడు గాంధీ. సాలోచనగా "మనం షేర్లు అమ్మెయ్యబోతున్నాం లక్ష్మీ" అన్నాడు. లక్ష్మి అదిరిపడింది "ఏమిటీ" అన్నది అర్థం కానట్టు.

"టాటావాలాకి నువ్వు షేర్లు అమ్మెయ్యబోతున్నావ్"

"ఎందుకు?"

"అతడికి నీమీద నమ్మకం కలిగించుకోవటానికి."

"ఎందుకు గాంధీ ఇదంతా? ఎలాగూ నువ్వు పందెం గెలవబోతున్నావుగా" అంది లక్ష్మి.

గాంధీ మాట్లాడలేదు. అతని కళ్ళ ముందు ఒక దృశ్యం మెదులుతూంది,




రామ్మోహనరావ్ తనని నౌకర్ల ముందు మెడ పట్టుకుని వరండాలోంచి క్రిందికి తోసెయ్యటం.

“రామ్మోహనరావ్‌ని దెబ్బకొట్టాలి లక్ష్మి. ఊపిరి తిరక్కుండా దెబ్బకొట్టాలి. ఒక భవంతిని కూల్చెయ్యాలీ అంటే దాన్ని డైరెక్టుగా కొట్టటంకన్నా దాని స్థంభాల్ని కొట్టటం మంచిది. టాటావాలాని ఎలాగైనా మన వైపు తిప్పుకోవాలి. ఈ జాతీయం సంగతి నీకు తెలిసిన తర్వాత కూడా నువ్వు షేర్లు అమ్మేసేవనుకో. మనకి ఓ ఐదు లక్షలు నష్టంవస్తుంది. నిజమే. కానీ టాటావాలాకి నీమీద విపరీతమైన నమ్మకమూ, గౌరవమూ కలుగుతుంది. ఇంకోలా చెప్పాలంటే అయిదు లక్షల్తో అతడి నమ్మకాన్ని మనం కొనుక్కొంటున్నామన్న మాట.”

“కానీ ఎలా? ఈపాటికల్లా రామ్మోహనరావు సగందారిలో వుంటాడు కదా. వెళ్లగానే ఆయన టాటావాలాకి ఫోన్ చేసి షేర్లుకొన్నావా అని అడుగుతాడు. అతడు లేదంటాడు. ఆతరువాత నేను వెళ్ళినా లాభం లేదు. ఇదంతా నీప్లాన్ అని ఆయనకి తెలిసి పోతుంది”

“నువ్వు ఇలా ఇక్కడికి వస్తున్నట్టు టాటావాలాకి తెలుసా?”

“తెలీదు” అంది లక్ష్మి.

"హనుమంతరావుకి''

"వూళ్ళోలేడు"

గాంధీనవ్వేడు "అంటే వాళ్ళకన్నా ముందు నువ్వే వెళ్ళబోతున్నావ్ లక్ష్మీ"

''రాకెట్‌లో వెళ్ళినా సాధ్యం కాదు''

''నాకు రాకెట్ సాధ్యంకాదు కానీ విమానం తెప్పించటం మాత్ర సాధ్యం అవుతుంది"

ఏదో చెప్పటానికి నోరు తెరిచిన లక్ష్మి అతడు చెప్పింది అర్థమై అలాగే నిశ్చేష్టురాలై ఆగిపోయింది, ఆమె తేరుకునేలోపులోనే గాంధీ మద్రాసు ఫోన్‌చెయ్యటం -లైటినింగ్ కాల్‌లో చార్టర్డ్ ఏజెన్సీ ద్వారా రామంపాడుకి విమానం పంపించే ఏర్పాటు చెయ్యటం జరిగి పోయినయ్.

చాలాకాలం క్రితం ప్రధాన మంత్రి రావటం కోసం అక్కడ తాత్కాలిక మైన విమానాశ్రయం నిర్మించారు. మద్రాసు నించి అన్ని ఏర్పాట్లూ పూర్తి చేసుకుని విమానం రావటానికి రెండు గంటలు పడుతుంది.

దండకారణ్యంలో వున్న పేపర్ ఫాక్టరీ నుంచి రామంపాడు చేరుకోవటానికి రెండొందలా యాభై కిలో మీటర్లు ప్రయాణం చెయ్యాలి.

గాంధీ కారు డ్రైవ్ చేయసాగేడు. అడవి మధ్యలోంచి కారు ఎత్తూ పల్లాల్లో నెమ్మదిగా వెళ్తుంది. లక్ష్మి అతడిని వాలుగా చూసింది. పైకేవీ తెలియనట్టు చాలా మామూలుగా-మామూలు బలహీనతలతో కనబడే ఈయువకుడు అవసరంవస్తే ఎంత ప్రజ్ఞాపాటవాన్ని ప్రదర్శించగలడు! అనుకుంది. ఎంతో షార్ప్‌గా ఆలోచిస్తే తప్ప ఇంత సునిశితమైన ఆలోచన రాదు. నిజానికి తను సాయంత్రం తాపీగా వెళ్ళి రేపు షేర్లు అమ్మవచ్చు. కానీ రామ్మోహనరావు ఆవూరు చేరుకోగానే తనగురించి తప్పక వాకబు చేస్తాడు. ఆసమయానికి ముందే తను అక్కడుండాలి. ఇంతా చేసిన తరువాత కూడా ఒకవేళ తను ఇలా గాంధీని కలుసుకున్న సంగతి ఆయనకి ఏదో విధంగా తెలిసి పోయిందంటే-మొత్తం అయిదు లక్షలు నష్టానికీ సిద్ధపడి వేసిన ఎత్తు బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది. ఒక స్టేజీ కొచ్చిన తరువాత విమానప్రయాణాలూ, డబ్బు ధారాళంగా ఖర్చుపెట్టటాలూ జీవితంలో ఒక భాగం అయిపోతాయనుకుంటా. వాళ్ళు వెళ్లేసరికి ఎయిర్ పోర్ట్‌లో విమానం దిగుతూంది. చాలా చిన్నది ఇద్దరు ముగ్గురు మాత్రమే ముందు కూర్చోవటానికి వీలున్నది.

గాంధీ దార్లోనే ఆమెకు చెయ్యవలసిందంతా చెప్పాడు.

పైలెట్ దిగి గాంధీని విష్ చేసేడు.

లక్ష్మి విమానం ఎక్కింది. గాంధీ టైమ్ చూసుకున్నాడు. పర్లేదు ఇంకాచాలా టైమ్ వున్నది.

విమానం ప్రొపెల్లర్లు రొదచేసుకుంటూ తిరగటం ప్రారంభించినయ్. గాంధీ దూరంగా వెళ్ళి నిలబడ్డాడు.




విమానం కదిలింది లక్ష్మి నవ్వుతూ చెయ్యి వూపింది. గాంధీ కూడా చెయ్యి వూపేడు. విమానం గాలిలోకి లేచి పశ్చిమ దిక్కుగా సాగిపోయింది.

సరిగ్గా అదే సమయానికి రామ్మోహనరావ్ కారు అరటిపళ్ళూ, న్యూస్ పేపర్లూ కొనుక్కోవటానికి రామంపాడులో ఆగింది.

వ్యాపారంలో ఎంత మంచి నిర్ణయం తీసుకున్నాం అన్నదికాదు ప్రశ్న. ఎంత తొందరగా తీసుకున్నాం అనేది ముఖ్యం.

## 23

సరిగ్గా పన్నెండున్నరకి లక్ష్మి టాటావాలా ఇంటికి షేర్ల సర్టిఫికెట్‌తో సహా చేరుకున్నది.

అతను బ్యాంకు జాతీయం విషయం తెలిసినప్పట్నుంచీ పది లంఖణాలు చేసినవాడిలా వున్నాడు. డైరెక్టర్ పదవి పోయిందనే బాధలో.

"బాధపడకండి సాబ్. మళ్ళీ డైరెక్టరే పదవికి ప్రయత్నిద్దాం" అంది లక్ష్మి ఓదారుస్తున్నట్టు.

"ఈ సారి బ్యాంకు ప్రభుత్వానిది" అన్నాడు నీరసంగా.

"ప్రభుత్వం డబ్బుది! డబ్బు మనది!!"

టాటావాలా తేరుకున్నాడు. ఈమాత్రం ధైర్యం చెప్పిన వాళ్ళు ప్రొద్దున్నించీ ఎవరూలేరు. "ఏమిటిలా వచ్చావ్" అని అడిగాడు.

"మీ షేర్లు మీకిచ్చెయ్యటానికి" అన్నది. ఆమె చెబుతున్నది అతడికి అర్థం కాలేదు. "ఏమిటి" అని అడిగాడు.

"నిన్న షేర్లు అమ్మేస్తానంటే వద్దన్నారు. కానీ ఒక్క విషయం టాటాసాబ్. మీరు నన్నెందుకు నమ్మటంలేదో నాకు అర్థంకావడంలేదు. నాకో పెద్దతోడు కావాలి. చీకటి అరణ్యంలాటి ఈ వ్యాపార విషయాల్లో మీరే ఆ తోడు అనుకున్నాను అందుకే నిన్నవచ్చి మీకు అన్ని విషయాలు చెప్పాను మీరు నమ్మలేదు. తిరిగి రామ్మోహన్‌రావ్‌గారికి ఫోన్‌చేశారు. ఆయన వద్దనటంతో మీరు తీసుకోలేదు" ఆమె అడిగింది.

గది నిశ్శబ్దంగా వుంది. ఆ మౌనంలోంచి ఆమె నెమ్మదిగా కంఠం విప్పింది. "-ఏదో ఈరోజు ధర పెరిగిందనీ-నిన్న నేను అమ్మకపోవటమే మంచిదయిందనీ నేను అనుకోవటంలేదు టాటాసాబ్. ఈ షేర్లు మీదగరున్నా - నాదగ్గరున్నా ఒకటే!- నిన్నే వీటిని అమ్మేసినట్టు లెక్క. వీటిని మీరు తీసుకుని నిన్నటి ధరే ఇప్పించండి."

టాటావాలాకి తను వింటున్నది కలో నిజమో అర్థంకాలేదు. దాదాపు ఇరవై లక్షలు తను లాభం పొందబోతున్నాడు. ఒక నిస్సహాయురాలైన అమ్మాయి తన ప్రేమనీ అభిమానాన్నీ పొందటానికి ఇంత త్యాగం చేస్తోంది. ఇందులో మోసం ఏమీ లేదని అతడికి తెలుసు. ఈ అమ్మాయి తన ప్రాపకం కోసం ప్రయత్నిస్తూందేతప్ప-తనని ఏ విధంగానూ మోసం చెయ్యలేదు.

ఈ నలభై అయిదేళ్ళవయసులో తననిచూసి ఒక ఇరవై రెండేళ్ళ అమ్మాయి, ఒక బ్యాంకు డైరెక్టరు-మనసు పారేసుకొని-తనచుట్టూ తిరగటం ...ఇరవై లక్షలు తృణప్రాయంగా వదులుకోవటం! అతడు కలలో కూడా వూహించలేదు.

అతడికి ఇరవై లక్షంకన్నా - ఒక అమ్మాయి తనంటే ఇష్టపడుతూందన్న విషయం భరించలేనంత సంతోషాన్ని ఇస్తూంది.

సరిగ్గా పది నిముషాల్లో అగ్రిమెంట్ పూర్తయింది.

షేర్లు లాకర్‌లోపెట్టి తాళంవేస్తూ టాటావాలా "నాకు ఈ షేర్లు నష్టానికి అమ్మేవన్న విచారం ఏమీ పెట్టుకోకు అమ్మాయీ ఇకనుంచి నువ్వు నా మనిషివి. నువ్వు ఈరోజు తీసుకున్న ఈ నిర్ణయం భవిష్యత్తులో నీకు ఎంతగానో లాభిస్తుంది. ఆ గాంధీ నీకు ఏమీకాడని నువ్వే అంటున్నావు. నీకెవరూ లేరని ఇకనుంచీ చింత వద్దు. నేనున్నాను." తాళం వెయ్యటం పూర్తిచేసి. సరిగ్గా పడిందో లేదో లాగిచూస్తూ టాటావాలా అన్నాడు. "....ఆ గాంధీపైకి అలా కనబడ్డాడుకానీ చాలా తెలివైన వాడు. తప్పకుండా పంతం నెగ్గి ఆ రామ్మోహన్‌రావు కూతుర్ని వివాహం చేసుకొని




తీరతాడు. నాకు తెలుసు"

చెప్పటం పూర్తిచేసి, తాళం పడిందని నిర్ణయించుకుని, వెనుదిరిగిన టాటా వాలా కుర్చీలో శిలలా అచేతనంగా కూర్చొన్న లక్ష్మినిచూసి విస్మయం చెందాడు. అప్పుడే ఆమె సంతకం పూర్తిచేసి పెన్‌కాప్ మూత పెట్టబోతూంది. ఆమె చేతులు అలాగే మధ్యలో ఆగిపోయివున్నాయి. ఆమెలో కదలిక లేదు. అతడి చివరివాక్యమే ఆ గదిలో ఇంకా ప్రతిధ్వనిస్తున్నట్టు వుంది. ఆమె మొహం నిర్లిప్తంగా వుంది.

"ఏం అమ్మాయ్-నీ ఆరోగ్యం బానేవుందికదా"

చప్పున ఆమె తెప్పరిల్లి "బానేవుంది" అని అక్కణ్ణుంచి లేచిపోయింది. నడుస్తూనే ఆమె ఆలోచించసాగింది.....

చాలారోజుల క్రితం రామ్మోహన్‌రావు ఇంట్లో డిన్నర్‌కి వెళ్ళినప్పుడు తనని ఆయన గుర్తుపట్టిన సంగతి రాత్రికి రాత్రే అడవిలోవున్న గాంధీకి ఎలా తెలిసిందో ఆమెకి ఇప్పుడు అర్థమయింది.

○ ○ ○ ○ ○ ○ ○

రామ్మోహనరావు ఇంటికి చేరుకొనేసరికి సాయంత్రం అయింది. కార్లోంచి దిగీదిగటంతోటే సరాసరి టెలిఫోన్ దగ్గిరకి వెళ్ళి టాటావాలాకి ఫోన్ చేసేడు.

"టాటా! మన బ్యాంకు...."

టాటావాలా మధ్యలో అందుకుని "నిన్న సాయంత్రమే నాకు తెలిసింది. మీకు చెప్దామంటే మీరు లేరు" అన్నాడు.

"అంతకన్నా ముఖ్యమైన విషయాన్ని మాట్లాడదామని ఫోన్ చేసాను టాటా.... లక్ష్మి అమ్మదామనుకున్న షేర్లు ఎలాగైనా కొనెయ్యాలి."

"ఈరోజే కొనేసాను"

"వ్హాట్" అని అరిచాడు రామ్మోహన్‌రావు.

"లక్ష్మి ఈరోజు నా దగ్గరికి వచ్చింది. బ్యాంకు జాతీయం చెయ్యబడితే షేరుధర పెరుగుతుందని ఆ అమ్మాయికి తెలీదు. పాపం షేర్లన్నీ అమ్మేసింది"- చిన్న అబద్ధం ఆడేడు టాటావాలా.

రామ్మోహన్‌రావు మొహంలో ఇంత సేపటికి తిరిగి కళవచ్చింది. "గుడ్" అంటూ ఫోన్ పెట్టేసేడు.

"ఏమిటి నాన్నా రాగానే ఈ ఫోన్లు? నీకు ఆరోగ్యం కన్నా ఈ డబ్బు సంపాదనే ఎక్కువైంది" అంది అప్పటివరకూ అక్కడే వున్న హారిక.

"డబ్బు సంపాదన కాదమ్మా" అన్నాడాయన. అంతలో ఆయన మొహం కఠినమైంది. "మనకున్న డబ్బు పది తరాలవరకూ సరిపోతుంది. ఇంకో పది కంపెనీలు మనవి జాతీయం చెయ్యబడినా మనకి ఫర్లేదు. కానీ ఇరవై సంవత్సరాల క్రితం ఒక వానపాముతో చిన్న సవాలు చేసేను. చిన్నపామే కదా అని అప్పుడు పెద్ద కర్రతో కొట్టలేదు. ఇప్పుడాపాము తనో నాగుఅనుకొని భ్రమపడి పడగ విప్పటానికి ప్రయత్నిస్తూంది. మరిలేవకుండా పడగ చితకొట్టెయ్యాలి....."

"అది నిజంగా వానపామే అయితే నీకు భయం ఎందుకు నాన్నా?"

"మరీ అంత కొట్టిపడెయ్యటానికి వీల్లేదమ్మా. నేను అలాగే అనుకొని ఇంత కాలమూ వూరుకున్నాను. ఈ కొద్దికాలంలో అది చాలా బలాన్ని సంతరించుకొంది. అయినా ఫర్లేదనుకో. పాతిక సంవత్సరాలుగా ఈ డబ్బు వ్యవహారాల్లో పండిపోయిన రామ్మోహన్‌రావు తల్చుకున్నాడంటే నిజంగా నాగువచ్చినా ఎదుర్కొగలడు. కాని చిన్న విషయం ఎదుటివాళ్ళు తెలుసుకోలేక పోవటం వాళ్ళ దురదృష్టం"

"నీ భయం అతడు యాభై లక్షలు సంపాదిస్తాడనా? నీకూతుర్నిచ్చి పెళ్ళి చెయ్యవలసి వస్తుందనా నాన్నా?"

ఊహించని ఈ ప్రశ్నకి రామ్మోహనరావు చకితుడై కూతురివైపు చూసేడు. ఆమె మొహం మామూలుగా వుంది. లేచి ఆమెదగ్గిరకి వెళ్ళాడు భుజంమీద చెయ్యివేసి అనునయిస్తున్నట్టు "ఆ ఆవేశ లో ఏదో నోరు జారి పందెం కాసేను. దాని గురించి నువ్వేమీ భయాలు పెట్టుకోకమ్మా. నీ వివాహం ఆ అనామకుడితో నా కంఠంలో ప్రాణం వుండగా జరుగదు."

ఆమె మాట్లాడలేదు.




తన మాటలు కూతుర్ని కన్విన్స్ చెయ్యలేదేమోనని, "అతడి పతనం అప్పుడే ప్రారంభం అయిందమ్మా నిన్న జాతీయం చేయబడిన బ్యాంకు విషయం తెలియక - ఈరోజు అతడి ప్రతినిధి ఇక్కడ పాతిక లక్షల విలువగల షేర్లు నాలుగు లక్షలకి అమ్మేసింది" అన్నాడు.

"అమ్మేసింది అంటున్నావు....ప్రతినిధి అమ్మాయా నాన్నా"

"అమ్మాయే లక్ష్మి అని ఒకదాన్ని ఉంచుకున్నాడులే. అలాటి హీన చరిత్రులకి అంతకన్నా సంస్కారంగా బ్రతకటం ఏం చేతనవును!"

గదిలో ఒక మూల అందంగా అమర్చబడిన ఫెరన్ మొక్క కూడా గాలికి వూగటం మానేసింది. ఆమె ఫోన్ పక్కనున్న సోఫాలో నెమ్మదిగా కూర్చుంది. ఒక అగ్ని పర్వతం బ్రద్దలయ్యే ముందు పరిస్థితి....తుఫాను వచ్చేముందు వాతావరణం...

రామ్మోహనరావు తన గదిలోకి వెళ్ళబోతూండగా ఆఖరి ప్రశ్న అడిగింది. "అయితే ఈరోజు టాటావాలాకి షేర్లు అమ్మినది లక్ష్మి అన్నమాట"

"అవునమ్మా" అంటూ ఆయన లోపలికి వెళ్ళిపోయాడు. ఆమె సోఫావెనక్కి వాలి కళ్ళు మూసుకుంది.

లక్ష్మి లక్ష్మి....ఎక్కడో విన్నదీ పేరు. ఎక్కడ? మెదడు పొరల్లో కదలిక మొదలై కొన్ని రోజులక్రితం తను ఫోన్‌లో గాంధీతో జరిపిన సంభాషణ

గుర్తుకొచ్చింది. మొత్తం వున్నదున్నట్టుగా.

................ ....

"మీరు ఈ వూళ్లో శంకుస్థాపనచేసిన రోజున ఒక అమ్మాయిని పరిచయం చేసేరు జ్ఞాపకంవుందా? ఆ అమ్మాయి ఎవరు?"

"ఎందుకు?"

"ఆ అమ్మాయి మీకు పరిచయస్థురాలయితే ఫర్లేదు కానీ అలా కాని పక్షంలో........"

"ప్లీజ్ గోహెడ్"

"ఈ రోజు ఆ అమ్మాయి మా ఇంటికి డిన్నర్‌కొచ్చింది. శివశక్తి లాన్‌బ్యాంకు డైరెక్టర్ అట"

"ఆ అమ్మాయి పేరు లక్ష్మి"

"కానీ త్రిపుర అని విన్నానే."

"త్రిపురనేని లక్ష్మి. అసలు విషయం ఏమిటి?"

.....................

సంభాషణ్లో ప్రతీమాటా గుర్తుంది. అంతేకాదు, ప్రతీ దృశ్యమూ గుర్తుంది. ప్రొద్దున్న గాంధీ గాటిలో ఒక అమ్మాయిని గిర్రున ఎత్తి తిప్పేదృశ్యంతోసహా....

లక్ష్మి ఈ వూళ్ళోనేవుండి షేర్లు అమ్మినపక్షంలో ఆ అమ్మాయి ఎవరు?

ఆమె కళ్ళుమూసుకొనే ఆలోచిస్తూంది. ఆమె మెదడులో ఏదో ఫ్లాష్‌లాగా వెలిగింది. కళ్ళుతెరిచి ఫోన్ దగ్గరికి లాక్కుంది.

డైరెక్టరీ చూసి నెంబర్లు తిప్పి విమానాశ్రయానికి ఫోన్ చేసింది.

"హల్లో....గ్రౌండ్ కంట్రోల్" అట్నుంచి వినబడింది.

"ఈరోజు ఎయిర్‌పోర్ట్‌లో చార్టర్డ్ విమానం ఏదైనా దిగిందా?" ఇంగ్లీషులో అడిగింది.

"ఆ దిగింది మాడమ్-మద్రాసు నుంచి వచ్చింది. వయా రామంపాడు"

"అందులో ఎవరొచ్చారు?"

"మాదగ్గర ఆ రికార్డు ఉండదు"

"కానీ గ్రౌండ్ కం[illegible] కి తెలియనిదేముంటుంది?" ఆమె నవ్వింది.

"[illegible]"

"పి. [illegible] షన్ డి. సెక్రటరీ'

"ఒక అమ్మాయి [illegible] దిగింది మాడమ్ అంతే"

"థాంక్యూ" [illegible] చేసింది. ఆమె అనుమానం నిజమైంది. కానీ ఆ గెలుపు ఆమెకి సంతోష[illegible]

## 24

జెయింట్ వీల్ దగ్గర [illegible] గాం[illegible]




మనిషి ఎత్తుకి దాదాపు పదిరెట్లు పెద్దదయిన ఇనుప చక్రం అది. గిర్రున తిరుగుతూంది

యూకలిప్టస్ దుంగల్ని నీళ్ళలో నానబెట్టి ఆ చక్రంపక్కగా పడేస్తున్నారు కూలీలు. చెవులు చిల్లులుపడే శబ్దంతో ఆ చెట్లని చిన్నచిన్న ముక్కలు చేస్తోంది ఆ ఇనుపచక్రం. పొయ్యిలో ఉప్పుపడితే వచ్చే శబ్దంలాంటిది - దానికి వందరెట్లు ఎక్కువగా పేళ్ళు పగుల్తున్న ధ్వని.

ఆ చిన్న ముక్కలు బెల్టుమీదగా క్రషింగ్ యూనిట్‌కి చేరుకుంటాయి. అక్కణ్ణుంచి మిక్సింగ్ ప్లాంట్‌కి-తరువాత రసాయనిక మార్పుకోసం రియాక్షన్ సెంటర్‌కి-అక్కడ గుజ్జుగామారి-పెద్దపెద్ద చక్రాల మధ్యలో నలిగి - తడి ఆరి - పేపరుగా రోల్ చేయబడ్తుంది.

ఇవతల వైపు యూకలిప్టస్ చెట్టువేస్తే-అవతల్నుంచి కాగితం బైటికిరావటం మనిషి మేధస్సుకి సహేతుకమయిన నిదర్శనం. దాదాపు రెండు ఫర్లాంగులున్న ఆ ప్రోసెస్‌ని చూసుకుంటూ గాంధీ ప్యాకింగ్ సెక్షన్‌కి వచ్చేసరికి-అతడికోసం ఎవరో వచ్చారన్న కబురు వచ్చింది.

అదే కాంపౌండ్‌లో ఉన్న ఆఫీసుకి వెళ్ళాడు అతడు. బైట ఒక విదేశీకారు వుంది. తనకోసం ఇంతదూరం అడవికి అంత ఖరీదైన కారులో వచ్చేది ఎవరా అని

ఆలోచిస్తూ ఆఫీసు స్ప్రింగ్ డోర్ తెరిచి లోపలికి ప్రవేశించాడు. గాంధీ.

కుర్చీలో తాపీగా వెనక్కి వాలి-పొడవాటి చుట్ట కాలుస్తూ అందులోని ఆనందాన్ని తీరిగ్గా ఆస్వాదిస్తూ కనిపించాడు.

ది పేపర్ కింగ్!

అంజిరెడ్డి!!

o o o o o o o

అతడా ప్రపంచంలోకి ఎలా ప్రవేశించాడో తెలీదు. ఎక్కడ్నుంచి ప్రవేశించాడో తెలీదు. ఏ శక్తి పెట్టుబడితో ప్రవేశించాడో తెలీదు.

ఇప్పుడు మాత్రం కాగితపు వ్యాపారానికి మకుటం లేని మహారాజుగా వెలుగుతున్నాడు. మిత్రులు ముద్దుగా పేపర్ కింగ్ అంటారతడిని. శత్రువులు కసిగా పేపర్ టైగర్ అని వ్యవహరిస్తారు. ఎవరు ఏదన్నా అతడి పేరుతో ఒక భాగమైనదన్న విషయాన్ని ఎవరూ కాదనలేరు. మధ్యప్రదేశ్ అడవుల్లో సగం అతడు బినామీ పేర్లతో కాంట్రాక్టుకి తీసుకున్నాడు. హిమాచల్ ప్రదేశ్‌లో సగం మిల్లులు అతడివే. అతడి కనుసైగతో దేశంలో పేపరు ధర రెండింతలవుతుంది. అతడు దయ తలిస్తే ఒకరిద్దరు అనామకులు ఎం.పి. లవ్వగలరు. అతడు వద్దనుకుంటే మంత్రులు రాజీనామా చేయవలసి వస్తుంది.

సరిగ్గా పాతిక సంవత్సరాల క్రితం అతడు అనామకుడు పాతిక వేలకి పాత ఇల్లు అమ్మేసి చిత్తుకాగితాల వ్యాపారం మొదలుపెట్టాడు దానితోపాటే మనీ సర్క్యులేషన్ స్కీము పెట్టి పోలీసులు అరెస్టుచేస్తే నాలుగు నెలలు జైల్లో వున్నాడు. (ఈ విషయం అబద్ధమని ప్రత్యర్థులు ప్రచారంకోసం వాడుకుంటున్నదనీ అతడిమిత్రులు అంటారు) జైలునుంచి బైటకొచ్చాక ఈ చిన్న చిన్న వ్యాపారాలు నిరర్థకమని తెలుసుకొని మధ్యప్రదేశ్ వెళ్ళిపోయాడు. పదిమంది కోయవాళ్ళని చెంచుల్ని కూడగట్టుకుని వాళ్ళ పేరుమీద గవర్నమెంట్ ఇచ్చే సబ్సిడీలను అనుభవించి ఒక పేపరు మిల్లు పెట్టాడు కో-ఆపరేటివ్ పద్ధతిమీద కోయల సహకార సంస్థగా నడుస్తున్న ఆ మిల్లు సంవత్సరం తిరిగేకల్లా నష్టాల్లో పడితే ఒక మార్వాడీ చాలా చౌకగా కొనేశాడు. ఆర్నెల్లు తిరిగేసరికల్లా అంజిరెడ్డి ఆ మార్వాడీకి ఎలా భాగస్వామి అయ్యాడో నేలుసుకొనే తెలివితేటలు కోయలకిలేవు. కోయల్తో కలిసి నడిపినప్పుడు విపరీతమైన నష్టంవచ్చిన ఆ మిల్లు, మార్వాడీతో చేతులుకలపగానే ఎలా లాభాల్లోకి దింపాడో విచారించేటంత సమయం ప్రభుత్వానికి లేదు. మార్వాడీతో చేతులు కలిపిన అంజిరెడ్డి అక్కడితో వూరుకోకుండా అతడి భార్యతో కాళ్ళుకలిపాడు. ఫలితంగా ఆమార్వాడీ మధ్యప్రదేశ్‌లో ఒక మిల్లుచూసుకుంటూంటే అంజిరెడ్డి గుజరాత్‌లో మరో రెండు మిల్లుల్నీ-ఆ మార్వాడీ భార్యనీ చూసుకునేవాడు.

అలా విస్తృతమైంది అతడి వ్యాపారం.

వ్యాపారానికి రాజకీయానికి దగ్గరసంబంధం వుంటుంది. హిమాచల్‌ప్రదేశ్‌లో

సన్‌సిల్క్ శిరోజాలు.
ఇక మీ భుజాల్లపై సూర్యకిరణాల నిగనిగలు,
పట్టుపోగుల సోయగాలు.

సన్‌సిల్క్*
బ్యూటీ షాంపూ

పట్టులాంటి మెత్తని, నిగనిగలాడే కురులకోసం-
అతివల సౌందర్య సాధనాలలో అతిముఖ్యమైంది

హిందుస్తాన్ లీవర్ లిమిటెడ్‌వారి విశిష్ట ఉత్పాదన

HTF-HLL-6101

ఒక ఫ్యాక్టరీ పెట్టటానికి ఐదులక్షలు లైసెన్సుకోసం లంచం అడిగాడు పరిశ్రమల మంత్రి. దాన్ని టేప్‌రికార్డులు పెట్టి-ఫోటోలుతీసి - జర్నలిస్టులకిచ్చాడు. రాష్ట్రంలో గగ్గోలు ఎత్తిపోయింది. మంత్రివర్గం రాజీనామా చెయ్యవలసి వచ్చింది. రాష్ట్రంలో అప్పటిదాకా అధికారంలో వున్నది ప్రతిపక్షం కాబట్టి కేంద్రం ఈ చర్యతో సంతోషించింది. ప్రధానమంత్రి స్వయంగా అంజిరెడ్డిని అన్యాపదేశంగా అభినందించటం జరిగింది.

ప్రధాని అభినందనలు పొందినవాడిని ప్రధానమైన వాడుగా గుర్తించకపోతే ద్రోహం అని రాజకీయనాయకులకు తెలును. రాత్రికి రాత్రి అంజిరెడ్డి గొప్పవాడు అయిపోయాడు. వివిధరాష్ట్రాల ముఖ్యమంత్రులూ అకస్మాత్తుగా తమ రాష్ట్రంలో పరిశ్రమలు పెట్టాల్సిన ఆవశ్యకతను గుర్తించి అంజిరెడ్డిని ఆహ్వానించారు.

దాదాపు పదహారు మిల్లులకి అంజిరెడ్డి అలా అధిపతి అయ్యాడు. మొత్తం పేపరునంతా కంట్రోల్‌చేసి పేపర్‌కింగ్ అనిపించుకున్నాడు.

....గాంధీ లోపలికి ప్రవేశిస్తూనే హల్లో అన్నాడు అతడినిచూసి. గాంధీ అతడిని అంతకుముందు కలుసుకోలేదు. కానీ అంజిరెడ్డిని తెలియని వారు పరిశ్రమలో చాలా తక్కువ.

"రాగాంధీ-కూర్చో"

తన ఆఫీసులో తననే ఆహ్వానించి చనువుగా కూర్చోబెడ్తూన్న అంజిరెడ్డి వైపు చిత్రంగా చూసేడు గాంధీ. కానీ ఏమీ మాట్లాడకుండా కూర్చున్నాడు.

"ఎలావుంది మిల్లు" సంభాషణ ప్రారంభించాడు అంజిరెడ్డి.

"కొత్త కదా.... మొత్తం మీద ఓ. కే"

"ఏమంటున్నాడు రామ్మోహనరావు"

గాంధీ ఉలిక్కి పడ్డాడు, రామ్మోహనరావు ప్రసక్తి వస్తున్నట్టుంది అతను సడెన్‌గా తెచ్చేసరికి, తను ఈకాగితం అంతా అతడికి సోల్ సెల్లింగ్ ఏజెన్సీకి ఇచ్చినవిషయం గురించి మాట్లాడటానికి వచ్చాడేమో ఇతడు అనుకున్నాడు. చాలా కాలం నుంచీ ఇద్దరూ ఈ ఫీల్డులో వుండబట్టి అతడికి ఏజన్సీ ఇవ్వటం ఇష్టంవుండి వుండదు. నిజానికి తనకీ ఇష్టంలేదు. అయినా అగ్రిమెంటు జరిగిపోయింది కదా. ఇప్పుడిక చెయ్యటానికి ఏమీలేదు. ఆవిషయమే చెప్పాడు.

అంజిరెడ్డి అతడి మాటలకి పెద్దగా నవ్వాడు. ''నేనుఅడుగుతున్నది మీ పేపరు గొడవలుకాదు. ఏమంటున్నాడు? అతడు-కూతుర్ని ఇచ్చి పెళ్ళి చేస్తానంటున్నాడా?"

గాంధీ మొహంలోకి రక్తం ఒక్కసారిగా జిమ్మినట్టయ్యింది. కేవలం ముగ్గురికి మాత్రమే తెలుసు ననుకున్న ఈరహస్యం ఇంతగా బట్టబయలు ఎప్పుడయిందో అతడికి అర్థం కాలేదు.

అతడి పరిస్థితి గమనించకుండా అంజిరెడ్డి చెప్పుకుపోతున్నాడు "చాలా పెద్ద పందెం కాసేవు నువ్వు. మెచ్చుకోవల్సిందే-కానీ నువ్వు చేసిన తప్పల్లా రామ్మో




హనరావు తెలివి తేటల్ని తక్కువ అంచనా వెయ్యటమే. అతడిప్పుడు-ఈక్షణం ఏం చేస్తున్నాడో తెలుసా"

"తెలీదు" అప్రయత్నంగా అన్నాడు గాంధీ.

"నీ స్నేహితురాళ్ళిద్దరూ నీకు ఇప్పటికి ఆరు వ్యాపార సూత్రాలు చెప్పారు. ఏడోదీ ఆఖరిదీ అయిన ముఖ్యసూత్రం నేను చెబ్తాను విను. బిజినెస్‌లో మనం ఏం చేస్తున్నాం అనేదాని కన్నా మన ప్రత్యర్థి ఏం చేస్తున్నాడనేది ముఖ్యంగా గమనించాలి. నప్వే స్టేజీలో ఇది మర్చి పోవటం దురదృష్టం. మొదట్లో నువ్వు వేలలో సంపాదిస్తున్నప్పుడైతే పర్లేదు. కానీ ఇప్పుడు రామ్మోహన రావు. నిజంగా రంగంలో దిగాడు. నిన్ను అణిచి వెయ్యటానికి నిజానికి ఇప్పుడే మొదటి ఎత్తువేసాడు. అతడి ప్రకారం సరీగ్గా మార్చి పందొమ్మిదో తారీఖుకి నువ్వు జైల్లో వుంటావు ఆతారీఖుయొక్క ప్రాముఖ్యత నీకు తెలుసు కాబట్టి నేను చెప్పఖ్ఖర్లేదు."

గాంధీ తడి ఆరిన గొంతుతో "ఇవన్నీ మీకెలా తెలిసినయ్? మాటల సందర్భంలో నా స్నేహితురాళ్ళు అనిన మాటలు, సరిగ్గా పదాలతోసహా మీకెలా చేరినయ్?" అని అడిగాడు.

అంజిరెడ్డి నవ్వేడు "ఇది చాలా చిన్న విషయం, నీజీవితం అంతా డైరీలా వ్రాసెయ్య బడింది....చివరికి నువ్వో బిచ్చగత్తె దగ్గిర వదిపైసలు తీసుకుని

వ్యాపారం ప్రారంభించిన విషయంతో సహా మొత్తం అంతా....రామ్‌తీర్థతో నువ్వు భాగస్వామి అవటం కూడా మాకు తెలుసు. బైదిబై ప్రియంవద ఏమంటున్నది?"

గాంధీ దానికి సమాధాన మివ్వకుండా "ఇదంతా మీకెలా తెలిసిందీ అని అడుగుతున్నాను" అన్నాడు.

"ఐ. జి నా స్నేహితుడు ఏదో సరదాగా 'చూడవోయ్ ఈకుర్రవాడెవడో చాలా చురుగ్గా వున్నాడు" అని మాట వరసకి అన్నాను. అదేదో (ప్రధానమంత్రి) ఆజ్ఞలా పని నుంచి క్రైమ్‌బ్రాంచి ఇన్‌స్పెక్టర్లని నియమించి వంద పేజీల రిపోర్టు తయారు చేయించి ఇచ్చాడు"

ఆగదిలో సూది పడితే వినబడేటంత నిశ్శబ్దం వ్యాపించింది. గాంధీ కుర్చీలోంచి లేచాడు. అతడి మొహం కఠినంగా వుంది. "నిజమే! నేను రామ్‌తీర్థ దగ్గిర అప్పు తీసుకున్న మాట నిజమే. అప్పు తీసుకొని స్థలం కొని కొండ చర [illegible] కాదు. పెరిగాక అమ్మిన మాట కూడా నిజమే కానీ ఇందులో ఏదీ చట్ట [illegible] నన్ను న్యాయస్థానంలో నిలబెట్టలేరు"

"ఇప్పుడు న్యాయస్థానం గురించి ఎవరు మాట్లాడారు?" అన్నాడు అం.జిరెడ్డి "నిజంగా ఒక మనిషిని దోషిగా నిలబెట్టాలంటే చట్ట విరుద్ధమైన తప్పే చెయ్యక్కర్లేదు. మీఫ్యాక్టరీ గొట్టం వుండవలసిన దానికన్నా తక్కువ ఎత్తులో వుంది అన్న కారణంగా నిన్నీక్షణం అరెస్టు చెయ్యవచ్చు."

పచార్లు చేస్తున్న గాంధీ తన కుర్చీ దగ్గిరకి వచ్చి ఆగి, వెనుగ్గా దాని మీద చేతులు వేసి నిలబడి తాపీగా అన్నాడు.

"ప్రభుత్వంలో బాగా పలుకుబడి వున్న మనుష్యులు మీరు. తప్పు చేసినా-చేయక పోయినా నేరస్థుడిగా నిలబెట్టగలిగే వీలు మనచట్టంలో ఎప్పుడూవుంది. ఏమీ లేని స్థితి నుంచి లక్షలు సంపాదించిన నేను-గతంలో ఏదో ఒక తప్పు చేసే వుంటాను. ఇప్పుడు దాన్ని చూసీ చూడనట్టు వదిలెయ్యటమా-నన్ను జైల్లో ఇరికించటమా అన్నది నిర్ణయించేది మీరు నేను మీకు సాయపడితే మొదటిది చేస్తారు. సాయపడక పోతే రెండోది చేస్తారు. దానికి తగిన సాక్ష్యాధారాలన్నీ ఈపాటికే సమకూర్చుకున్నారు. ఇప్పుడిక నిర్ణయం నా మీద ఆధారపడి వుంది. ఇంత వరకూ వచ్చాక ముసుగులో గుద్దులాట ఎందుకు-చెప్పండి నేనేం చెయ్యాలి" అని అడిగాడు.

స్ట్రైయిట్‌గా గాంధీ ఇలా అంతా ఒక్కసారి విప్పిచెప్పేసరికి అంజిరెడ్డి అవాక్కయిపోయి వెంటనే తేరుకుని, అతడిని అభినందిస్తున్నట్టూ "భేష్" అన్నాడు. "... నేను అనుకున్న దానికన్నా చాలా తెలివైనవాడివి నువ్వు."

"మనం అసలు విషయానికి వద్దామా?"

అంజిరెడ్డి వెంటనే మాట్లాడలేదు. కుర్చీలోంచి లేచి కిటికీ వద్దకు వెళ్ళి బైట ఆకవికేసీ, యూకలిప్టస్ చెట్లకేసి చూడసాగేడు. అతడి కంఠం మంద్ర స్థాయిలో వినిపించింది.




"కాగితం పరిశ్రమ గొప్ప సంక్షోభాన్ని ఎదుర్కొంటోంది గాంధీ! ఎవరూ వూహించనంత సంక్షోభం! దీనికి కారణం విపరీతంగా పుట్టుకొస్తున్న కాగితం మిల్లులు. ఇందులో కొన్ని నావి ఉన్నాయి. కానీ ఈ రాష్ట్రానికి సంబంధించినంత వరకూ చాలా మిల్లుల్లో రామ్మోహనరావుకి వాటావుంది. కాగితం ధర పడిపోతే వీటన్నింటికీ నష్టం తప్పదు. అందువల్ల కొన్ని మిల్లుల్ని ఏదో ఒక కారణంగా మూసెయ్యాలి.

గాంధీ ఉలిక్కిపడ్డాడు. ఒకవైపు విద్యార్థులూ అమాయకులైన బడిపిల్లలూ టెస్ట్ బుక్సూ, నోట్ పుస్తకాలూ లేక బాధపడుతూవుంటే ఇంకోవైపు ఈ పారిశ్రామికవేత్త కాగితం ధర నిలకడగా వుంచటం కోసం-వీలైతే కొంచెం పెంచటం కోసం ఉత్పత్తిని తగ్గిద్దామనుకుంటున్నాడు. మిల్లులు మూసేద్దామనుకుంటున్నాడు.

అంజిరెడ్డి చెప్పుకుపోతున్నాడు.

"—ఈ ధర తగ్గటంవల్ల రామ్మోహనరావుకి పెద్దగా నష్టం వుండదు. కారణం ఏమిటంటే అతడివి చాలావరకూ స్వంత ఏజెన్సీలుండటమే. తన మిల్లుల్లో తయారైన కాగితాన్ని అతడు ఎలాగైనా అమ్ముకోగలడు. పోతే నష్టంఅల్లా నాకే! అదలావుంచు. ఈ పరిస్థితుల్లో అతడు మీ కంపెనీతో అగ్రిమెంట్ అయ్యాడు. మీ మిల్లు తయారుచేసే కాగితాన్నంతా కొనెయ్యటానికి వప్పుకున్నాడు. అప్పుడే నాకు అనుమానం వచ్చింది. ఒకవైపు కాగితంధర పడిపోతూఉంటే ఈ రామ్మోహనరావు

ఇంకో కొత్త కంపెనీతో అగ్రిమెంట్ ఎందుకు అయ్యాడా అని ఆలోచించాను. తర్వాత కొద్దీ ఎన్నో విషయాలు బైటపడ్డాయి. నీవూ అతడూ పందెం వేసుకోవటం - మీమధ్య స్పర్థలూ - వగైరా....

నిన్ను పూర్తిగా అణిచివెయ్యటానికి రామ్మోహన్‌రావు చాలా పటిష్టమైన ఎత్తు వేసాడు. ఆ ఎత్తులో మొదటి అంశంగా రామ్మోహనరావు ప్రస్తుతం ఏం చేస్తున్నాడో తెలుసా...."

"ఏం చేస్తున్నాడు?"

.............................

"ఫ్రెండ్స్" అన్నాడు రామ్మోహనరావు కంఠం సవరించుకని "ఇప్పుడు యువ విద్యార్థి సమైక్య సంస్థా ప్రతినిధి శ్రీ విద్యాప్రకాశ్ మాట్లాడతారు."

ప్రకాష్ లేచాడు.

ఆ హాల్లో వందమందిదాకా విద్యార్థి ప్రతినిధులున్నారు. పదిమందిదాకా పెద్ద వాళ్లున్నారు. ఇద్దరు ప్రతిపక్ష నాయకులున్నారు.

ప్రకాష్ మాట్లాడసాగాడు. అతడు ఆవేశంతో మాట్లాడుతూ వుంటే ఆగది కంపించిపోయింది. "ఫ్రెండ్స్ ఈ బూర్జువా ప్రభుత్వం మనకేమి చెయ్యలేదు. ఈ నిరంకుశమైన గవర్నమెంట్‌ని విద్యార్థిలోకంమాత్రమే ఎదుర్కొగలదు. సమసమాజ స్థాపనకై విద్యార్థులు కార్మికకర్షకులతో కలిసి నడుముబిగించిన రోజే నవచైతన్యం వెల్లివిరుస్తుంది...." ఇలా అరగంటసేపుసాగింది. అతడి సంభాషణలో ప్రతీ అయిదు నిముషాలకి చప్పట్లు పడ్డాయి శ్రోతలు ఆవేశంతో వూగిపోయారు.

అక్కడున్న సభికుల్లో నూటికి తొంభైమంది, ఇంకా నూనూగుమీసాల ప్రాయంలోనే వున్నారు. అందులో చాలామంది హాస్టలీర్స్‌వున్నారు. ప్రతి హాస్టల్లోనూ ఒకరిద్దరు ఈ వర్గ ప్రతినిధులు వుంటారు కొత్తగాచేరిన విద్యార్థులని తమ మాటల ప్రభావంతో ఆకర్షిస్తారు. ఈ ఒకరిద్దరూ తరువాత యూనియన్ నాయకులై - కాలేజీ నుంచి బైటకొచ్చాక రాజకీయనాయకులవటమో లేక తల్లితండ్రులఆస్థితో వ్యాపారం పెట్టటమోచేసి కార్లూ మేడలూ ఆస్తులూ గడిస్తారు. వీరి ప్రభావంవల్ల ఆకర్షితులై ఆవేశపరులైన కుర్రవాళ్ళుమాత్రం కాలేజీలో వున్నంతకాలం విప్లవం గురించిమాట్లాడి బైటకొచ్చాక గుమస్తాలూ టైపిస్టులూ అవుతారు.

రాత్రిళ్లు బకెట్లూ రంగులూ తీసుకొని బావున్న గోడల్నిండా వ్రాస్తారు. "ఫాసిస్టు శక్తులు నశించాలి" (ఈ ఫాసిస్టు శక్తులేమిటో ఎవరో ఎవరికీ తెలీదు) "విద్యార్థీ మేధావి వర్గం ఏకం కావాలి" (కాదని ఎవరన్నారో తెలీదు) వీరిలోచాలా మందికి విప్లవం వస్తే అమెరికాలోలా అందరికీ కార్లుంటాయని ఓ నమ్మకం. లేక పోతే రష్యాలోలాగా అందరూ ఆరోగ్యంగా ఆనందంగా వుంటారని అభిప్రాయం. ఏ దేశం బాగుపడాలన్నా ప్రొడక్టివిటీ కావాలనీ - అది ఏ 'ఇజం' ద్వారా వస్తుందో జనం నిర్ణయించుకోవాలనీ - వారిలో సగం మందికి పైగా అవగాహనలేదు.




ప్రకాశ్ మాట్లాడిన తర్వాత ప్రతిపక్ష నాయకుడు మాట్లాడాడు. ఇండియా వంటి పేద దేశంలో చదువుకూడా ఖరీదై పోతూందీ అంటే దానికికారణం ప్రభుత్వం అసమర్థతే అని నొక్కి వక్కాణించాడు. నోట్ పుస్తకాలు చౌకధరలకి అందించలేని ఈ ప్రభుత్వాన్ని - టెక్స్ట్ బుక్స్ సరియైన సమయానికి అందించలేని ఈ ప్రభుత్వాన్ని గద్దెదింపటానికి తనవెనుక విద్యార్థిలోకం ఉండి సాయపడితే, తాను ప్రాణాలు అర్పించటానికైనా సిద్ధమే అనేసరికి హాలంతా చప్పట్లు. ఆక్షణం సహజంగా అతడే విద్యార్థిలోకాన్ని రక్షించే దేముడిగా కనబడ్డాడు. ఇక్కడింకో సంగతి. మంత్రికి విదేశీ కారుంటే ప్రతిపక్ష నాయకుడికి అంబాసిడర్ కారుంటుంది. కార్లు మాత్రం ఇద్దరికీ వుంటాయి. ఒకరు తిడ్తారు. మరొకరు తిట్టబడ్తారు. అసెంబ్లీ అనే ఆట స్థలంలో ఇద్దరు రాజకీయ క్రీడాకారులు ఇలా ఆడే ఆటని జనం అనే మూర్ఖులు పన్నులు అనబడే టిక్కెట్టుకొని చూసి ఆనందిస్తూ ఎప్పటికైనా ఓ ప్రతిపక్ష నాయకుడు తమని సంతృప్తి పరచడా అని అయిదు సంవత్సరాలపాటు చూస్తారు.

రామ్మోహనరావు మాత్రం కొంచెం సెన్సిబుల్‌గా మాట్లాడాడు. "ఆంధ్ర రాష్ట్రంలో పేపరుమిల్లులన్నిటి తోనూ నాకు కొద్దో గొప్పో పరిచయంవుంది. పేపరు ప్రస్తుతం ధరకన్నా చౌకగా ఇవ్వటానికి మేము సిద్ధమే కానీ ప్రభుత్వమే ముందుకు రావటం లేదు. ఈరోజు టెక్స్ట్ పుస్తకాలు మార్కెట్‌లోకి రావటం లేదంటే దానికి కారణం ప్రభుత్వం అసమర్థతే తప్ప పేపరు దొరకక కాదు. పేపరు మిల్లుల ప్రతినిధిగా ఈసభలో పేపరు ధర అయిదు శాతం తగ్గిస్తున్నామని ప్రకటించటానికి సంతోషి

స్తున్నాను."

విద్యార్థులు హర్షధ్వానాలు చేసారు.

తరువాత తీర్మానాలు చెయ్యబడ్డాయి. ప్రతీకళాశాల రిప్రజెంటేటివ్వ్ సమ్మె జయప్రదం చేస్తానని ప్రమాణం చేసాడు. మరీ ఆవేశం ఎక్కువైన కుర్రవాడు వేలు కోసుకొని రక్తం చిమ్మాడు కూడా.

ప్రతీ వూరిలోనూ కలక్టరేటు వరకూ ఊరేగింపులు నిర్వహించటానికి నిర్ణయించారు.

సభ జయప్రదం అయింది.

o o o o o o

"అదీ జరిగింది" అన్నాడు అంజిరెడ్డి. గాంధీ మొహం అతను చెప్పినదంతా విని పాలిపోయింది.

"ఇక జరగబోయేది తెలుసా?"

"తెలుసు" అన్నాడుగాంధీ "....పేపరు ధర తగ్గించమని ప్రభుత్వం పేపరు మిల్లులమీద వత్తిడి తెస్తుంది. ఇప్పుడే రంగంలోకి ప్రవేశించిన నేను ఆ ధరకి సప్లయి చెయ్యలేను. క్రిమినల్ క్లాజ్‌తో ఫార్వర్ కాంట్రాక్ట్‌లోకి ప్రవేశించిన నేను, నా ఫ్యాక్టరీ మూసెయ్యవలసి వస్తుంది. సరుకు సప్లయి కానందుకు రామ్మోహనరావు నన్ను అరెస్ట్‌చేయిస్తాడు. సరిగ్గా పందొమ్మిదో తారీఖు యాభై లక్షల్తో వెళ్ళి పందెం నెగ్గవలసిన నేను ఆరోజు నాటికి జైల్లో వూచలు లెక్క పెట్టుకుంటూ కూర్చుంటాను"

"నువ్వు చాలా తెలివైనవాడివి. అన్నీ చెప్పకుండానే గ్రహించావు" అన్నాడు అంజిరెడ్డి-వచ్చి కుర్చీలో కూర్చొంటూ "....కానీ ఇక్కడ సమస్యని నీ పరిధిలోనే నీకేమవుతుందా అని ఆలోచించావు. రామ్మోహనరావు ఆలోచన ఇంతకన్నా పెద్దది. పేపరుధర కొద్దిగా తగ్గించి దాని ద్వారా సగం మిల్లుల్ని శాశ్వతంగా మూతవేయించి తాను లాభాల్ని పొందాలని చూస్తున్నాడు. అతడు ఇక్కడ మర్చిపోయిందల్లా ఒకటే....న్యూటన్ మూడో చలనసూత్రం"

గాంధీ మనసులో ఆలోచనలు జెట్‌కన్నా స్పీడ్‌గావెళ్తున్నాయి. ఏం నిర్ణయించుకోవాలి తెలియటంలేదు.

"చెప్పుగాంధీ. ఎటూ నీ మిల్లు మూతపడటం ఖాయం. నాతోపాటే ఇప్పుడే మూసేస్తావా? రామ్మోహన్‌రావు విద్యార్థుల్తో స్ట్రయిక్ చేయించి ప్రభుత్వంధర తగ్గించామన్నాక-ఆ ధరకి ఉత్పత్తి చెయ్యటం చేతకాక అప్పుడు మూసేస్తావా?"

గాంధీ చాలాసేపు మాట్లాడలేదు. ఇద్దరు వ్యక్తులమధ్య జరిగే ఈ ఆటలో తను ఇప్పుడు చేసుకోబోయే నిర్ణయం తన జీవితాన్ని శాశ్వతంగా నిర్ణయిస్తుంది. నిశ్శబ్దాన్ని చీలుస్తూ నెమ్మదిగా అన్నాడు.

"నేను మీ మాటవల్ల ఈరోజే మిల్లు మూసేస్తే-రామ్మోహనరావు నామీద కోర్టుద్వారా చర్య తీసుకోడని నమ్మకం ఏమిటి?"




అంజిరెడ్డి నవ్వాడు. "—ఆ బాధ్యత నాకు వదిలిపెట్టు అతడిని వూపిరి తిరగనంత పనుల్లోనూ కష్టాల్లోనూ సతమత మయ్యేటట్టుచేసే పని నాది. సరేనా"

"నేను నెలరోజుల్లో ఏదో ఒక కారణం చూపించి లాకౌట్ ప్రకటించి ఫ్యాక్టరీ మూసేస్తాను" అంటూ అంతిమ నిర్ణయాన్ని తెలిపాడు గాంధీ

"గుడ్" అంటూ లేచాడు అంజిరెడ్డి. "నన్ను నమ్మినవాళ్ళు ఎవరూ చెడిపోలేదు. సంవత్సరం తిరిగేసరికల్లా నీకు రాజ్యసభ మెంబరుగా పిలుపు వచ్చినా ఆశ్చర్యపోనక్కర్లేదు."

ఇద్దరూ కలిసి బైటకొస్తూ గాంధీ అడిగాడు. "ప్రభుత్వంలో ఇంత పలుకుబడి వున్న మీరు రామ్మోహనరావుని మొదటే అణిచెయ్యొచ్చుగా. ఈ స్ట్రైక్ జరిగి రాష్ట్రంలో అల్లర్లు మొదలై ప్రభుత్వానికిదో తలనొప్పిగా తయ్యారయ్యేవరకూ వూరుకోవటం దేనికి?"

"ప్రధాన మంత్రికీ- రాష్ట్రపు ముఖ్య మంత్రికీ పడటం లేదు. ఏ క్షణమైనా ఇతడిని తొలగించాలనుకుంటున్నారు ప్రధాన మంత్రి. ఈ పేపరు సంక్షోభాన్ని ముఖ్యమంత్రి సరిగ్గా ఎదుర్కోలేకపోతే ప్రజల్లో అతడికి పరపతి పోతుంది. ప్రధాన మంత్రి ఆ కారణంగా ఇతడిని తీసివెయ్యవచ్చు. అందుకే చూసీ చూడనట్టు వూరుకోవటం జరుగుతూంది"

"నగం మిల్లులు మీవి. ఇవి మూసేస్తే సంక్షోభమే ఇది చాలు కదా"

"చాలా ఇరుకున పెట్టే ప్రశ్నలు అడుగుతున్నావు నువ్వు" అన్నాడు అంజిరెడ్డి. "అయినా చెబ్తాను విను. ముఖ్య మంత్రిని తొలిగిస్తే ప్రస్తుతం హోం మినిష్టర్ తరువాత ముఖ్యమంత్రి అవుతాడు. అది నాకు ఇష్టంలేదు. రాష్ట్రంలో చెలరేగిన అల్లరులని అణచలేని హోం మినిస్టరు ముఖ్యమంత్రి కాదగడని నేను ప్రైమ్ మినిస్టరుకి చెప్పాలీ అంటే రాష్ట్రంలో చాలా పెద్దఎత్తున అలజడి జరగాలి. నోట్ బుక్స్, టెక్ట్స్ బుక్స్ కారణంగా లేచిన దుమారం చాలామంది సానుభూతి పొందుతుంది. పోతే పేపరుధర తగ్గుతుంది. నాకో యాభై లక్షలు నష్టం వస్తుంది నిజమే. కానీ నేను చెయ్యబోయ్యే వ్యక్తి ముఖ్యమంత్రి పదవి ఖరీదు రెండు మూడు కోట్లు వుంటుంది. పేపరు వ్యాపారం కన్నా ముఖ్యమంత్రి పదవీ వ్యాపారం పదిరెట్లు పెద్దది."

"ఎవరు కాబోతున్నారు మనముఖ్యమంత్రి?"

"చెప్పకతప్పదా?"

"మీకు అభ్యంతరం లేకపోతే"

అంజిరెడ్డి నవ్వేడు. "రామ్మోహనరావు ఇంత కష్టపడి చేయిస్తున్న ఈ స్ట్రైయికు పరాకాష్టకు చేరుకోగానే ఒక మంత్రి ఒక అద్భుతమైన నిర్ణయాన్ని తీసుకొని, ఈసమస్యకి పరిష్కారం చెప్పి-అటు ప్రజల్ని ఇటు ప్రధానమంత్రినీ కూడ గట్టుకోబోతున్నాడు అతడే మన ముఖ్య మంత్రి కాబోతున్నాడు."

"ఆ నిర్ణయం ఏమిటి అని అడగను. కానీ ఎవరా మంత్రి అని అడగొచ్చా?"

అంజిరెడ్డి తాపీగా "మనప్రస్తుత విద్యాశాఖామంత్రి" అన్నాడు. ఈసమాధానం విని తేరుకోవటానికి గాంధీకి చాలా టైమ్ పట్టింది. హోం మినిస్టర్‌ని కాదని అతడిని మీరెందుకు ముఖ్య మంత్రిని చేస్తున్నారు? అసలిప్పుడున్న ముఖ్యమంత్రిని ఎందుకు తీసెయ్యవలసి వస్తోంది?" అని అడిగాడు అయోమయంగా.

అంజిరెడ్డి కారు ఎక్కాడు. డ్రైవర్ నమ్రతగా డోర్ వేసాడు. కారు కదుల్తూంటే అంజిరెడ్డి మృదువుగా అన్నాడు. "ముఖ్యమంత్రి కాపూ, హోం మినిస్టరు కమ్మా, విద్యాశాఖా మంత్రి రెడ్డి కాబట్టి-ఆ చివరిది నా కులం కాబట్టి...."

దుమ్మురేపుకుంటూ కారు కదలిపోయింది.

గాంధీ అచేతనంగా వుండిపోయాడు. రాష్ట్రంలో అతి సామీప్య భవిష్యత్తులో రాబోయే అంత పెద్ద కల్లోలానికి ఇంత చిన్న కారణమా? ఎన్నో రాజకీయ వ్యూహాలు పంజాలు విసురుకోవటానికి చిన్న పిల్లలు 'ఓనామాలు' వ్రాసుకొనే కాగితం పుస్తకాలు సమిధలా!

అతడి మనిషిలో మనిషి అనుకున్నాడు. "దేముడా! రక్షించు నా దేశాన్ని.. ఈ భ్రష్టుల్నుంచి....కుల నర్పబాధా దష్టుల్నుంచి." (ఇంకా వుంది)

ప్రకృతి రహస్యం కనుగొనబడింది !




# మీ శరీర ఛాయను మెచ్చేలాగ పెంపొందిస్తుంది... సహజంగా, మృదువుగా.

ఫెయిర్ అండ్ లవ్లీ — విజ్ఞానం సాధించిన అద్భుతమైన పరిశోధన — నల్ల చర్మాన్ని ఎర్రబరిచే యీ క్రీమ్ రెండు విధాలుగా పనిచేస్తుంది.

చర్మం లోపల : ఫెయిర్ అండ్ లవ్లీలోని ప్రత్యేకమైన పదార్థం చర్మం లోపలనుంచి నల్లబరిచే ఆ ప్రక్రియను తగ్గిస్తూ, యితరులు మెచ్చేలాగ ఎర్రబరుస్తుంది.

చర్మ బయట : ఫెయిర్ అండ్ లవ్లీలోని 'ఎండను తడరోసే' పదార్థాలు, ఎండలోని అల్ట్రావయొలెట్ కిరణాలను తడరోసి మీ చర్మం ఎండ వల్ల నల్లబడకుండా కాపాడతాయి — మీరైతే ఆ సూర్యకిరణాల్లోని ఆరోగ్య మంతటినీ పూర్తిగా పొందగలుగుతారు.

• నెలం వాడకంతో, ఫెయిర్ అండ్ లవ్లీ మీ చర్మాన్ని మీరెప్పుడూ కోరుకునేటంత ఎర్రగా రూపొందిస్తుంది.







**ఫెయిర్ అండ్ లవ్లీ — నల్లని చర్మాన్ని ఎర్ర బరచడం కోసం సున్నితమైన తీరు**

హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

LINTAS.FALOV.13-1810

# ఆద్యంతాలమధ్య ప్రేమికుడు

వెన్నెల-మంచు మూసలో కరిగి, వేడి చుక్కల్లా పుడమితల్లి ఒడిలోకి జారి పడుతోంది

ఎంతో సేపటినుండీ కిటికీదగ్గర నిలబడి ఆ దృశ్యాన్నే చూస్తోంది ఆశాదేవి. ప్రకృతిలో లీనమయిపోయిన ఆమె చెవులకి దూరంనుండి తమ ఇంటిని సమీపిస్తున్న కారుహారనుశబ్దం సోకగానే చప్పున ప్రస్తుతంలోకి వచ్చింది.

ఆ శబ్దం ఆమెకు సుపరిచితమే. ఆ హారను సంగీత ధ్వనిలా విచిత్రంగా మ్రోగుతుంది. అందుకే చప్పున గుర్తుపట్టగలగటం ఆమె మెల్లగా మేడదిగి వచ్చేసరికి, కొడుకు కృష్ణప్రసాద్ కారు గ్యారేజీలో పెట్టి, ఈలపాట పాడుతూ లోపలికి వచ్చాడు.

ఎదురుగా శాలువా కప్పుకు నిలబడి వున్న తల్లిని చూడగానే నిర్ఘాంతపోయి "నువ్వింకా పడుకోలేదా అమ్మా" అన్నాడు.

జవాబుగా ఆశాదేవి మందహాసం చేసి "వెళ్ళి త్వరగా బట్టలు మార్చుకురా. భోజనం చేద్దాం-" అంది.

కృష్ణప్రసాదు ఆశ్చర్యం రెట్టింపయింది

చేతిగడియారంకేసి ఒకమాటు చూసుకుని "పన్నెండు గంటలవరకు భోజనం చెయ్యకుండా కూర్చున్నావా?" అన్నాడు.

"నీకు భోజనం పెట్టకుండా నేనెప్పుడయినా తిన్నానా బాబూ?"

కృష్ణప్రసాద్‌కి మాటలు కరువయ్యాయి.

చివరకు మెల్లగా పశ్చాత్తాపం నిండిన గొంతుతో "పొరబాటయిపోయిందమ్మా.. అనుకోకుండా ఒక ఫ్రెండ్ బలవంతం మీద డిన్నర్ తీసుకోవాల్సివచ్చింది" అన్నాడు.

ఆమె నవ్వింది.

"ఇంతమాత్రానికే అంత బాధపడటం దేనికి! నీ కిష్టమని ఈరోజు పాయసం చేశాను పోనీ, అదయినా ఒక గ్లాసు తీసుకో."

అతనికి బొత్తిగా ఆకలిలేదు.

ఏదీ తినగల పరిస్థితిలో లేడు.

కానీ, తల్లి పరిస్థితి, మనస్థితి తనకి బాగా తెలుసు. తను ఏమైనా తింటేగానీ, ఆవిడ తినదు. అకస్మాత్తుగా తండ్రి కాలం చేసినప్పటినుండీ ఆవిడలా మారి

కొమ్మూరు రవీంద్ర - త్రివిక్రమ్

పోయింది.

"సరే, ఇవ్వు...." సోఫాలో కూర్చున్నాడు.

గ్లాసునిండా పాయసం తీసుకొచ్చింది.



అందులో ఏరి, ఏరి కిస్మిస్‌పళ్లు, జీడిపప్పులు వేసుకొచ్చింది.

కృష్ణ అలాగే అతికష్టంమీద పాయసం గ్లాసు ఖాళీ చేసాడు.

"పాయసం తాగానుగా. ఇక నువ్వు భోజనం చెయ్యి"

"పన్నెండు గంటలకి భోజనమా? రేపు ఉదయం కాస్త పెందరాడే భోజనం చేస్తే సరిపోతుంది. నన్ను బలవంత పెట్టకు."

"కనీసం ఒక యాపిల్ పండు అయినా తినమ్మా"

"సరే-" కాదనలేక కుర్చీలో కూర్చుంది.

విజయం సాధించినవాడిలా కృష్ణ ఉషారుగా 'ఫ్రిజ్ కేసి వెళ్లాడు. ఒక యాపిల్ అందుకుని, తల్లిదగ్గరకు వొచ్చాడు.

ం ం ం

నిశీధి నిశ్శబ్దాన్ని వెక్కిరిస్తున్న గోడ గడియారం కేసి చూస్తుండిపోయింది ఆశా దేవి. అలాంటి గడియారాలు దాదాపు ప్రతి గదిలోను ఉన్నాయి. అలా అమర్చటం భర్త విశ్వప్రసాద్ అభిరుచి మేరకు జరిగింది. మనిషి మరుగున పడినా, మరపురాని గుర్తులు కొన్ని మిగిలిపోతుంటాయి. అలాంటిదే ఇదీ-

ఆమెకు నిద్రపట్టటంలేదు.

అశాంతిగా, ఆందోళనగా ఉంది మనసు. ఆమెను భర్త జ్ఞాపకాలు ఎంత వేధిస్తున్నాయో, కొడుకు భవిష్యత్‌మీద ఊహాలు అంత బాధిస్తున్నాయి.

భవిష్యత్ అనేది ఎప్పుడూ నస్పెన్సే. మరుక్షణంలో ఏమి జరుగుతుందో తెలియకపోవటంకన్నా సస్పెన్సు ఏముంటుంది? తనదంటూ ఒక పరిశ్రమ స్థాపించి, యీనాడు తనవాళ్ళందరికీ సుఖభోగాల్ని, సంఘంలో స్థాయినీ సమకూర్చిపెట్టిన కార్యజీవిని గుండె తిరుగుబాటు బలిగొంటుందని-అదికూడ నిముషాల వ్యవధిలోనేనని-ఎలా అనుకోవటం?

అనుకోవటంతో నిమిత్తం లేకుండా జరిగేది జరిగిపోయింది!

తను నీడదాటి ఎండలోకి రావాల్సి వచ్చింది.

ఇంతకాలమూ రక్షణ ఇచ్చిన చెట్టుకూ పోయాక మరి నీడ ఎక్కడిది?

ఆమె బరువుగా నిట్టూర్చింది.

ఇప్పుడు తనపాత్ర తల్లిగా మాత్రం పరిమితమయింది. భార్యగా ఉన్న అధ్యాయం ముగిసిపోయింది.

కొడుకు తన ఆశలు నెరవేరుస్తాడా? వాడు తనని చెరగని ఆత్మీయతా గౌరవాలతో జీవితాంతం మన్నిస్తాడా? తండ్రికితగ్గ తనయుడనిపించుకుంటాడా? ఏమో....

ఎలా చెప్పటం? పరిసరాలు-స్నేహితులు-ఆయా ప్రభావాలనుండి తనని తాను రక్షించుకోగలగాలి కదా? అప్పుడే ఆ మనసులో మార్పు రానిది!

ఆమెకు ఒకసారి కొడుకు చిన్ననాటి ఫోటోలతో ఉన్న ఆల్బమ్ చూడాలనిపించింది. అది మంచంపక్క సొరుగులోనే ఉంచుకుంది. పెద్దలైటు వేసి, ఆల్బమ్ అందుకుంది.

ఒక్కొక్కపుట తిప్పుతూ, ఫొటోలు చూడసాగింది.

ం ం ం

కృష్ణప్రసాద్ తదేకంగా ఆ ఫోటో కేసే చూడసాగేడు.

ముగ్ధమనోహరంగా ఉంది.

ఆ కళ్లు-అందులోని కాంతి, ఆ నవ్వు-అందులోని గిలిగింత, ఆ పాలబుగ్గలు-అందులోని నిగారింపు....చూస్తున్నకొద్దీ మనసు పొంగిపోతోంది.

ఫోటో వెనక్కి తిప్పి చూశాడు.

ముత్యాల్లాంటి అక్షరాలతో పొందికగా "ఐ లవ్ యూ-అరవింద" అని




ఉంది.

ఫోటోని గుండెల కదుముకున్నాడు.

అరవింద!

తను 'డిన్నర్' తీసుకుంది అరవింద ఇంట్లోనే! తల్లికి ఆ సంగతి సూటిగా చెప్పలేకపోయాడు. తామిద్దరూ పెళ్ళి చేసుకోదలచినట్టుకూడా చెప్పాలి.

కానీ,

ఇంకా సమయం రాలేదు.

అరవింద తండ్రి పెద్ద బిజినెస్ మాగ్నెట్. ఆయన ఎప్పుడూ మహా నగరాలకి విమానయాత్రలు చేస్తుంటాడు. ఆయన్ని ఒకమాటు కలుసుకుని మాట్లాడమంటుంది అరవింద.

ఆయన ఒక్కసారైనా కనిపిస్తేకదా మాట్లాడటానికి వీలు!

ఈలోగా అరవిందని తీసుకొచ్చి తల్లికి పరిచయం చేస్తే ఆతర్వాత, తన ఊహలు చెప్పటం తేలికకదా?

○ ○ ○

"అమ్మా....ఈ అమ్మాయి పేరు అరవింద - నా ఫ్రెండు!"

భగవద్గీత చదవటం ముగించి, అరవిందని పక్కన కూర్చోబెట్టుకుంది ఆశాదేవి.

కాస్త సిగ్గు, మరికాస్త తొట్రుపాటు, కొంత విస్మయంతో ఆమెపక్కన గువ్వలా ఒదిగి కూర్చుంది అరవింద.

"ఏం చదువుకున్నావమ్మా?"

"బియ్యే లిటరేచర్...."

వాళ్ళు మాట్లాడుతుండగానే కృష్ణప్రసాద్ వంటింటివైపు వెళ్ళాడు, నాయర్ చేత కాఫీ టిఫిన్లు పంపించటానికి.

"మీ నాన్నగారేం చేస్తుంటారు?"

"బిజినెస్...."

"పేరు?"

"విశ్వపతిరావ్‌గారు"

ఆశాదేవి ప్రశ్నలు ఆగిపోయాయి. ఆమె ఆలోచనలో పడింది. చివరకు "విశ్వపతిరావ్‌గారా?" - ఆలోచనలోంచి తేరుకుని అడిగింది.

"అవును. కె. విశ్వపతిరావ్‌గారు"

మీ నాన్నగారూ కలిసి ఉన్న ఫోటోల్ని బట్టి వాళ్ళ స్నేహం చాలా పాతదని ఊహిస్తున్నాను"

"అరే-ఆ సంగతి నాకు తెలియదే! అయితే, సగంపని పూర్తయినట్టే నన్న మాట. ఇక నీవైపునుండీ నవ్ చూసుకో వాలి...మీనాన్నగారితో చెప్పేయ్ రాదూ?"

"ఇది మరీ బావుంది బెయవులో గేదె నుంచి బేరం ఆడినట్లు-నిన్ను పరిచయం చెయ్యకుండా, ఫలానా అతన్ని పెళ్ళి చేసుకుంటానని ఎలా చెప్పటం?"

"సరే - ఈ ఫలానాగారు మీ నాన్న గార్ని కలుసుకుంటారు. కానీ, ఎక్కడ ఎప్పుడు అనేది నువ్వే నిర్ణయించు. ఆయన్ని కలనుకోవటానికి అమెరికానో ఫ్రాన్సో వెళ్ళమంటే నావల్లకాదు...."

నవ్వేసింది అరవింద.

○ ○ ○ ○

"వీలుకాదు కృష్ణా! మీ నాన్నగారు హఠాత్తుగా గుండె ఆగి చనిపోయారని మాత్రమే నీకుతెలుసు. ఆగుండె ఎందుకు ఆగిపోయిందో నాకు తెలును...."

"ఏమిటమ్మా నవ్వు చెప్పేది?"

"అవును బాబూ! మీ నాన్నగారు, అరవిందతండ్రి ఒకవ్యాపారంలో వాటా దారులు. డబ్బుకి మాత్రమే విలువనిచ్చే విశ్వపతిరావు చాలా సునాయాసంగా మోసంచేసి మనల్ని లక్షలరూపాయల్లో నష్టపెట్టాడు... ఇప్పుడు చెప్పు..అలాంటి మోసగాడిని, పరోక్షహంతకుడిని నవ్వు మామగారిగా పిలవగలవా? ఆతనితో సంబంధం పెట్టుకోగలవా?"

కృష్ణప్రసాద్ అవాక్కయ్యాడు.

# కాంతి కరవాలం

ఎదీ ఎదగలేదు
బ్రతుకంతా పొట్టిది-
కాళ్ళున్నాయ్-
అంగుళానికో గొయ్యి!
ఎవరు తెచ్చి పోశారు
నీ బ్రతుకులో చీకట్లు!!
నా గుండెలోకి నడిచొస్తావా-
కదనంకోసం దొరుకుతై
కావాల్సినన్ని ఖడ్గాలు

**అడబాల**

"ఒకమాటు నాతో రా...."

ఇద్దరూ ఆశాదేవి గదిలోకి వెళ్లారు.

పాతఫోటోలు తీసి. ఒక ఫోటోలో భర్త ప్రక్కన ఉన్న వ్యక్తి చూపిస్తూ "ఈయనేనా మీ నాన్నగారు?" అడిగింది ఆశాదేవి.

"అవును....మా నాన్నగారి ఫోటో మీ ఇంట్లో ఎలా ఉంది?"

ఫోటోలు సర్దేసి, మందహాసంచేస్తూ, "వెళ్దాం పద" అని బయటకు దారి తీసింది.

○ ○ ○

"ఉంటాను కృష్ణా! బహుశః మీ అమ్మగారు మన పెళ్ళికి ఏమీ అభ్యంతరం చెప్పకపోవచ్చు. మా నాన్నగారు,

ఈ మలుపు అతడు ఊహించలేదు

అరవిందని మర్చిపోవటమంటే ఆత్మ హత్యా సదృశంగా ఉందతనికి. జీవితంలో పెళ్ళి చేసుకుంటే అరవిందనే - లేకపోతే లేదు, అనే గట్టి నిర్ణయం చేసుకున్నాడు.

అలాంటిది....ఇప్పుడు?!

ప్రేమకి పరీక్ష తప్పదా?

అందులోను ఇది విషమపరీక్ష,

అరవిందని పెళ్ళి చేసుకుంటే తల్లి మనసు గాయపడుతుంది.

చేసుకోకపోతే తనజీవితం ఎడారిలా మారిపోతుంది.

మనసు మరుభూమి అవుతుంది.

ఎలా-దీనికి పరిష్కారం?

ఆలోచనల మధ్య నలిగిపోయాడు. ఎటూ నిర్ణయించుకోలేక పోతున్నాడు. అరవిందతండ్రి దుర్మార్గుడైతే కావొచ్చు కానీ, కూతురు కూడా అలాంటిది కానక్కర్లేదు కదా? హిరణ్యకశిపుడి కొడుకు ప్రహ్లాదుడు అందుకు ఉదాహరణకాదూ? తండ్రి గురించి కూతుర్ని శిక్షించటమా?

-ఆశాదేవి అతనిఆందోళనంతావింది.

ఆమె లోలోపల భయంవేసింది.

తన సర్వస్వం-తనకలలపంట-తమ కుటుంబ ఔన్నత్యాన్ని దిగంతాల వద్దకు తీసుకు వెళతాడని భావిస్తున్న కొడుకుని ఏదో మాయాపాశం చుట్టుకుని తననుండీ దూరంగా లాక్కు వెళుతోంది

తల్లికి ఒక్కడే కొడుకయినప్పుడు-

వాడే ఆశలకొండ!

ఆకొండసైతం కరిగిపోతుందనిపించి నప్పుడు-తనవన్నీ భ్రమలే నవిపించి నప్పుడు ఆ జీవితం ముగిసిపోతేమాత్రం ఎవరికి నష్టం?

జీవిస్తూ నరకం అనుభవించేకంటే; మరణించి సుఖపడటం మేలుకాదూ?

తల్లి అంటే - 'తొలి' అని అర్థం అంటారు పెద్దలు.

ప్రతి మనిషికీ 'ఆది'-తల్లేకదా?

భార్యగానీ, ప్రియురాలుగానీ తరువాత వాళ్ళే.

-కృష్ణప్రసాద్ తల్లిమాటలకి మరేమీ మాట్లాడకుండా, బరువెక్కిన మనసులో, తనగదివైపు నడిచాడు.

o o o o

"హాపీ న్యూస్‌కృష్ణా"

"ఏమిటది?"అనాసక్తంగా అడిగాడు.

"నాన్నగారు వప్పుకున్నారు!"

"దేనికి?"

"మన పెళ్ళికి!"

"నన్ను చూడకుండానే?"

"వివరాలన్నీ చెప్పి, సీఫోటో చూపించాను. లోగడ తనవల్ల మీ కుటుంబానికి అన్యాయం జరిగిందనీ, అందుకెంతో పశ్చాత్తాప పడ్డాననీ, నన్ను నీకిచ్చి పెళ్ళి చెయ్యటం తనకెంతో మనశ్శాంతి నిస్తుందనీ అన్నారు...."

కృష్ణ మాట్లాడలేదు.

"ఏమిటలా గంభీరంగా ఉన్నావు?" భుజం పట్టుకు కుదిపింది.

"ఏమీలేదు. ఈ విషయాలు మా అమ్మకి చెబితే, ఆవిడ భావాలు ఎలా ఉంటాయా అని ఆలోచిస్తున్నాను...."

o o o o

"నేనుకూడా రాత్రంతా ఆలోచించాను బాబూ! తల్లిగా నా ప్రేమంతా నీమీదే ఉండటంసహజం నీప్రేమంతా అరవింద మీద ఉంది. ఇదికూడా అసహజంకాదు. నీ వయస్సు ప్రభావం అలాంటిది! నీకు నేను 'ఆది' వ్యక్తిని కావాలని ఎలా ఆశిస్తున్నానో, నీ జీవిత పర్యంతం-'తుది' వరకు, నీ నీడలోనే బ్రతకాలని ఆ అమ్మాయి ఆశించటంలోతప్పులేదు.

ఈ ఆద్యంతాల మధ్య నువ్వు మన శ్శాంతి కోల్పోయి బాధపడటం నాకు మరింత వేదన కలిగిస్తుంది. ఏతల్లి అయినా కొడుకుసుఖమే కోరుకుంటుంది.

నువ్వు అరవిందని పెళ్ళి చేసుకో బాబూ....

కానీ,

నీ తండ్రికి జరిగిన అన్యాయాన్ని మర్చిపోవటం, విస్మరించటంలాటి క్షమా శక్తి నాకు భగవంతుడివ్వలేదు. అందు చేత, నేను కొన్నాళ్ళు యాత్రలు చేయ దలుస్తున్నాను. నువ్వు అభ్యంతర పెట్టినా ఆగే స్థితిలో లేను. అలాగన్నా, నీవు ఊరుకోవని, ఈ ఉత్తరం రాసిఉంచి వెళుతున్నాను. మరేమీ కంగారు పడకు. ఎక్కడఉన్నా నా క్షేమం జాగ్రత్తగానే చూసుకుంటాను. నిన్నుచూడాలని మనసు తొందర చేసినప్పుడు తప్పక వస్తాను.

ఆశీస్సులతో,

అమ్మ. 

# వెలుగు రేఖ

చెర్ల సీతాదేవి

(గత సంచిక తరువాయి)

అతని కళ్ళల్లో కనిపిస్తున్న కోరికను చూస్తూ నిముషం పాటు అలాగే వుండి పోయింది.

.................

"మూర్తీ" తలుపు దబదబ బాదిన చప్పుడు కర్ణకఠోరంగా.

వులిక్కిపడింది తలుపుకేసిచూసింది.

ఎవరో తలుపు తడుతున్నారు.

తనింత సేపూ గడిపింది వూహల్లోనా! లేచి తలుతెరిచింది. ఎదురుగా వుంది హాస్పిటల్ కుర్రాడు.

"మూర్తిగారండీ యీ రాత్రికిరానని చెప్పమన్నారు. సీరియస్ కేసొస్తే డాక్టరు గారి వెంట వెళ్లారు."

చెప్పడం ముగించి కుర్రాడు సైకిల్ మీద తుర్రుమన్నాడు.

రాజ్యం కాసేపు అక్కడే అలాగే నిలబడిపోయింది.

'అతని ప్రపంచం వేరు. యిద్దరికీ ఎప్పటికీ పొంతన కుదరదు. ఇక తానేమీ ఆశలు పెట్టుకోకూడదు. యీ జన్మ కింతే రాసుందని ఐతికినంత కాలం గడిపెయ్యాలి.'

విరక్తిగా అనుకుంది.

భళ్లున తలుపులుమూసివచ్చి మంచం మీద వాలిపోయింది.

○ ○ ○ ○

తెల్లతెల్లవారుతుండగా తలుపులచప్పుడికి విసుగ్గా లేచివెళ్ళి తలుపులు తీసింది రాజ్యం. మూర్తి లోపలకొచ్చి తలుపు వారగా చెప్పులు విడిచి మంచంమీదవాలి పోయాడు. ఒక చెయ్యి గుండెలమీద ఒక చెయ్యి కళ్ళకడ్డంగా వుంచుకున్నాడు కళ్ళుమూసుకుని.

రాజ్యం తలుపు గడియపెట్టి మంచానికి రెండోవైపు నిలబడి అతన్ని చూసింది.

రాగానే అలా పడుకోకపోతే 'రాజ్యం. నా కోసం మేలుకుని ఎదురుచూశావా? యింకెప్పుడూ రాత్రులు వెళ్ళనులే' అని ఏదో ఒకటి మాట్లాడొచ్చుగదా. తన్ని దగ్గరికి తీసుకుని పడుకోవచ్చుగా, వుహూ - అటువంటి ఆలోచనలురావు. అతని ప్రపంచమే వేరు.

కోపగించుకొని మంచంకొనన పడుకొని గోడవైపు తిరిగి కళ్లు మూసుకుంది. మూర్తి మనసులో అశాంతి....అలజడి. ప్రయత్నించినా కంటిమీదికి కునుకు రావడంలేదు. వొద్దనుకున్నా కళ్ళముందు

పాప అమాయక వదనం....తల్లి ఘోష అతని హృదయాన్ని కలచివేస్తున్నాయి.

చిన్నారిపాప అయిదేళ్ళ వయస్సునే నూరేళ్లు నిండిపోయింది, తల్లిదండ్రులకు తన జ్ఞాపకాలనూ తీరని వ్యథను మిగిల్చి,

నరం లేదన్నాడు. పిల్లమీదనుంచి మంత్రం వేస్తూ నూదిని మూడుసార్లు తిప్పి ఆ నూదిని నీళ్ళ గిన్నెలో వేసే వాడు. చూస్తూండగానే నీళ్లు పసుపురంగు లోకి మారేవి. ఇలాగే దిగిపోతుందిజబ్బు



రాత్రంతా జాగారంచేసి పాపని బ్రతికిం చాలని విశ్వప్రయత్నంచేశారు డాక్టరు గారు. జబ్బు, తల్లిదండ్రులమూర్ఖత్వమూ పిల్ల ప్రాణాలు హరించాయి. ఈకాలంలో కూడా ఇంకా మంత్రాల్ని వొదలడం లేదంటే ఏమనుకోవాలి?

"డాక్టరుగారూ, యిరుగు పొరుగు మాటలువిని అతను ఎంతమంచికోనయం చేశాడన్న ఆశకొద్దీ సాయిబుని పిలిపిం చాము. నూది మంత్రానికి పత్యం అవ

అనేవాడు. మోసపోయాం. నా బంగారు తల్లిని చేతులారా పోగొట్టుకున్నా'మంటూ ఆ తల్లి గుండెలు బాదుకుని ఏడుస్తూ ఉంటే వినలేకపోయాడు. జాండిసు బాగా ముదిరిపోయింది. బైల్సు యూరిన్‌లోనే కాకుండా రక్తంలో కూడా ప్రవేశించి కలుషితం చేశాయి. రక్తం రంగు మారి పోయింది. అటువంటి ఆఖరు క్షణాల్లో డాక్టర్ మాత్రం ఏంచేస్తాడు?

కళ్ళు మూసుకుని పడుకోలేక

పోయాడు.

చెప్పు అడ్డుతీసుకుని చాప మీద నిల్క్ రజాయిలో పడుకున్న పాపకేసి చూశాడు. పాప అందంగా ఆరోగ్యంగా గ్లాక్సో బేబీలా వుంది. తృప్తిగా శ్వాస పీల్చుకుని పక్కకి తిరిగిచూశాడు.

రాజ్యం మంచంమీదలేదు వంటగది లోంచి చప్పుళ్లు వినిపిస్తున్నాయి.

కిటికీగుండా బాలభానుని లేతకిరణాల జిలుగు వెలుగు లోపలికి చొచ్చుకుని వస్తూంది. చూస్తూ యింకానేపు మంచం మీదే ఉండిపోయాడు.

అతనికి అప్పుడు రాజ్యం- 'మూర్తీ! అలావున్నావేం' అని తన తలను వొళ్లోకి తీసుకుని తన చల్లని వేళ్ళతో నుదురు వత్తితే బాగుండుననిపించింది. లేచి అన్యమనస్కంగానే పనలు పూర్తిచేసుకుని రోజూవెళ్ళే వేళకే యిల్లుదాటాడు.

ం ం ం ం

కోపంతో మనసు మండుతూంటే ఛళ్లున తలుపుమూసి వచ్చి మంచం మీద వాలిపోయింది రాజ్యం. "పెద్ద - తనే వుద్యోగం వెలగబెడుతున్నట్టు-రాత్రంతా జాగారంచేసి వొచ్చాడా - ఓగంట పడుకుని నిద్రపోతేకాదూ - అప్పుడే లేచి పరుగు - మెప్పుకోసం - పోనీయ్ తను మాత్రం ఏంచేస్తుంది? చెప్పినా వినేరకం కానప్పుడు- అతనిష్టం అతనిది" అనుకుంది.. చాలానేపు పడుకొనే ఉండపోయింది.

'తమకన్నా అందమైన వాళ్లుకాదు. వయసులోనా పెద్దవాళ్ళే. అయితేయేం సుఖంగా హాయిగా వున్నారు. ఎట్లావుండగలుగుతున్నారో? సుందరిని అడగాలి' అనుకుంది. వంట చేసుకుకోవాలనిపించలేదు. లేచి టీ, తాగింది.



మధ్యాహ్నం వేళ—

సుందరి పంపుదగ్గర బట్టలుతుకుతున్న చప్పుడుకి తలుపు తీసుకుని దొడ్లోకి వెళ్ళింది. సుందరి బట్టలు ఆరవేస్తూ రాజ్యాన్ని చూసి నవ్వింది.

తనూనవ్వి "మీరు బదిలీ మీద వొచ్చారా యీవూరు" అని అడిగింది.

"ఔను. ముందు కొత్తగూడెంలో ఉండేవాళ్ళం"

"మీపెళ్ళయి ఎన్నాళ్ళయిందీ?"

"నాలుగేళ్ళు" అనుకుంటూ వేళ్ళు చూపించింది.

రాజ్యం కాస్త ఆశ్చర్యపోయి" పిల్లలు లేరా?" అంది

"అప్పుడే వొద్దనుకున్నాం"

ప్రతి మాటా నవ్వుతూ మాట్లాడుతుంది సుందరి.

"మరి మీకో"

"పెళ్ళయి రెండేళ్ళు. యీడాది పిల్ల. పుట్టిల్లు యీవూరే"

ఎందుకో సిక్షిప్తంగా జవాబిచ్చి పూరు కుంది రాజ్యం.

"వస్తానండీ" అనేసి సుందరి బాత్ రూంలో ముఖం కడుక్కొని లోపలికెళ్ళి తలుపులు మూసుకుంది.

"అతను భోజనానికి వచ్చే వేళ యింటిగా తయారవుతుందనుకున్నాగా మోసు"

అనుకుని తలుపులు మూసి వచ్చి మంచంమీద వాలింది.

ఆలోచనల్లో కొట్టుకుపోసాగింది.

"జోడు గుర్రాల బండిలా సంసారం సాగిపోతుంటే రెండు కాళ్ళవాడు ఒంటి కాలివాడూ కలిసి పరుగు పందెం వేస్తు నట్టుగా వుంది తనసంసారం" అనుకుని నిట్టూర్చింది.

మనసులో అశాంతి అగ్ని పర్వతం రాజుకుంటోంది.

పక్కవాటా లోంచి నవ్వు లూ-మాటలూ వినిపిస్తున్నాయి.

కాసేపు పుస్తకం తిరగేసింది.... మనసు లగ్నం కాలేదు

లేచి, చీరమార్చుకుని పిల్లనుతయారు చేసి ప్లీడరుగారింటికి వెళ్ళి కూర్చుని సాయంత్రంవరకూ అక్కడే గడిపి వచ్చింది.

ఆరోజు-ఆ మరురోజు-తరవాతరోజు కూడా చిర్రుబుర్రులాడుతూ అంటీ ముట్ట నట్టు పొడి సమాధానాలిస్తూ చాలాముభా వంగా వుండిపోయింది అతనివద్ద.

"రాజ్యం నువ్వు మనసులో ఏదో వుంచుకుని నాతో సరిగ్గా మాట్లాడక పోతే నాకు ఏంతెలుస్తుంది చెప్పు" అని అడి గాడు మూర్తి ఒకరోజు.

"నీకు చెప్పి లాభంలేదు. అది నా ఖర్మ అని సరిపెట్టుకుంటున్నాను. అంతే" అని అతని ముందునుంచి వెళ్ళిపోయింది

మూర్తి అవాక్కుగా వుండిపోయాడు

"చీటికి మాటికి అలిగి కోపగించు కుంటుందెందుకో రాజ్యం. నేనేం లోటు చేస్తున్నానని? క్రిందటి నెల చీర కొని చ్చాను. కిరోసిన్ స్టౌవ్‌తో బాధపడలే కున్నానంటే ఎలక్ట్రిక్ స్టౌవ్ కొనిపెట్టా" అనుకున్నాడు

అసంతృప్తి - అశాంతి - అసంతృప్తి-వొంటరితనం. తోచక పోవటాలతో రాజ్యానికి మనశ్శాంతిలేకుండాపోయింది.

ఎలాగో పది రోజులు వోపికపట్టింది ఇక వుండాలనిపించలేదు. పుట్టింటికి వెళ్ళిపోవాలని నిశ్చయించుకుని బట్టలూ పెట్టె సర్దుకుని బయలదేరింది.

అది చైత్ర మాసం చివరి రోజులు. ఎండనిప్పులు చెరుగుతోంది.

రోడ్డుమీద జనసంచారంలేదు. కాకి అరుపుకూడా వినపడటంలేదు. వడగాలి వీస్తూంది. అతనొచ్చేసరికి ఇంట్లో ఉండ కూడదన్న పంతంకొద్దీ యింటికి తాళం వేసి వీధిలో కొచ్చింది.

అప్పుడు సమయం మూడుకావస్తూంది

రోడ్డుమీద ఒక్క రిక్షాకూడా కని పించలేదు.

పిల్లని భుజాన వేసుకుని ఓ చేత్తో సూట్‌కేస్‌తో నడుస్తూంది.

మిరుమిట్లు గొలిపే ఎండవేడి-కళ్ళు చూడలేక పోతున్నాయి.

మొండిగా నడుస్తూవుండగా ఎదురుగా వొచ్చిన రిక్షాలోకూర్చుని పోనివ్వమంది.

o o o o

గుమ్మంలో రిక్షాదిగి లోపలి కొచ్చిన




రాజ్యాన్ని చూసి మేనత్త తెల్లబోయింది.

చెమటలుకారుస్తూ ఎర్రబడ్డమొహంతో తోటకూర కాడలా వాడివున్న రాజ్యాన్ని, ఒకసారి పలకరించిచూసి,

"చంటి పిల్ల నేసుకుని బొగులు బొగులు మంటున్న ఎండలో రాకపోతే చల్లబడ్డాక రాగూడదూ" అంటూ రాజ్యం భుజాన్నవున్న పిల్లను అందుకుంది.

రాజ్యం ఆవిడకేమీ జవాబివ్వలేదు.

నవానరి తల్లిగదిలోకి వెళ్ళి పెట్టె అక్కడపడేసి మంచంపైవాలిపోయింది.

అంతే ఆవడక పడక మళ్ళీ వారం రోజుల వరకూ తల్లీ పిల్లా కోలుకోలేదు. వడదెబ్బ అని డాక్టరు మందు లిచ్చాడు.

"మూర్తికి కబురు చెయ్యానా?" అన్నాడు తండ్రి.

"అక్కర్లేదు" అనేసింది.

రాజ్యం అన్నగారి పెళ్ళికి వచ్చిందని ఆ యింట్లో ఎవరూ అనుకోలేదు. వేణు పెళ్ళి యింకా వారంముంది. పిల్లని వైరా. తండ్రి కంట్రాక్టరు ఖమ్మంలో పెత్తల్లి యింట్లో వుండి విమెన్సు కాలేజిలో బి. ఏ పాసయింది.

పెళ్ళి రోజు రానే వచ్చింది. ప్రయివేటు బస్సు మాట్లాడుకుని పెళ్ళి రేవనగా ఆముందురోజే తరలి వెళ్లారు పెళ్ళివారు. మూర్తి పెళ్ళినాటికీ వస్తానని చెప్పాడు.

మామూలు చిట్టి పొట్టి అభిప్రాయ భేదాలతో వెళ్ళుబు పోయింది.

పెళ్ళివారంతా బస్సునెక్కారు. పెళ్ళి కొడుకు, పెళ్ళి కూతురు ఫ్రంటు సీటులో కూచున్నారు- ఆ వెనక సీట్లో రాజ్యం కూచుంది.

ఆడా మగా పిల్లా పెద్దా అంతా కలగలుపుగా ఎవరికి తోచిన చోట వాళ్ళు కూచున్నారు. బస్సు బయలుదేరింది.

కొత్త జంట కబుర్లలోకి దిగింది. కొన్నేళ్ళ తర్వాత కలుసుకున్న ప్రాణ స్నేహితుల్లా మాట్లాడుకుంటున్నారు వాళ్లు. మాటలమధ్యలో ఒకళ్ళ కళ్ళల్లోకి ఒకళ్లు

చూసుకుని నవ్వుకుంటున్నారు. వాళ్ళకి తమతో పాటు ఇంకా చాలామందివున్నారని ధ్యాస లేదు. రాజ్యం పక్కన ఖాళీ వున్న సీట్లోకి వొచ్చి కూర్చుంది వెనక యిరుక్కుని కూచున్న ఓ ముసలమ్మ. రాజ్యం ఆవిడవేపు చిరాగ్గా చూసి, మూర్తి కోసం చుట్టూ వెతికింది కళ్ళతోనే.

ఓచుట్ట కాలుస్తున్న ముసలాయన పక్కనే కూచుని తలొంచుకుని ఆయన కబుర్లు వింటున్నాడు.

"ఏం మనిషి వొట్టి జంగ్లీ," అనుకుంది చిరాగ్గా.

కొందరు కుటుంబసమేతంగా, కూచుని తాపీగా ముచ్చట్లాడుకుంటున్నారు.

రాజ్యం విసురుగా తల తిప్పుకుని కిటికీ లోంచి చూస్తూ వుండి పోయింది.

ఇంటిదగ్గర కొత్త దంపతులకి పూర్తి స్వేచ్ఛా స్వాతంత్రాల పర్మిటు ఇచ్చినట్టు ఎవరూ వాళ్ళజోలి పట్టించుకోవటంలేదు. చూసీచూడనట్టు వూరుకుంటున్నారు.

కూర్చున్నా పక్క పక్కనే. నిలబడ్డా పక్క-క్కనే. ఆవిడ ఎక్కడుంటే అతనక్కడ.

రెండు సినిమాలు చూసొచ్చారు. ఓ రోజు సాయంత్రం గుట్టమీద దేవాలయానికి. ఇంకోరోజువాకింగు. రెండురోజులు కాళ్ళు నొప్పులని లేవలేదు రాధిక.

"అన్నయ్య వొదినకాళ్లు పట్టే ఉంటాడు."అనుకుంది రాజ్యం.

ఆ రోజు సాయంత్రం – హాల్లో గదిగుమ్మానికి ఓ పక్కగా వున్న బెంచీమీద కూచుని నెయిల్ పాలిష్ వేసుకుంటూంది రాధిక – వేణు ఆమె పక్కన కూచుని చూస్తున్నాడు.

రాజ్యం అక్కడవున్న సోఫాలో కూచుంది, చేతిలో పుస్తకంవున్నా ధ్యాస మాత్రం అన్నా-వదినలమీదే వుంది.

కుడికాలు బల్లమీద వుంచుకుని కాలి గోళ్లకి పాలిష్ వేసుకోసాగింది రాధిక. చూస్తూ కూర్చున్న వేణు 'యిలాతే నే వేస్తాను' అని రాధిక దగ్గర బ్రష్ తీసుకుని తన అరచేతిలో ఆమె పాదం వుంచుకుని ఎంతో శ్రద్ధగా వెయ్య సాగాడు.

సరిగ్గా ఆ సమయాన లోపలికొచ్చిన మూర్తి ఒక్క క్షణం వాళ్ళవైపు చూసి మరుక్షణం చూపు తిప్పుకుని రాజ్యానికి ఎదురుగా వున్న సోఫాలో కూర్చున్నాడు

'చూశావా' అని అడుగుతున్నాయి రాజ్యం చూపులు

మూర్తి చిన్నగానవ్వి 'పాప ఏది'అని అడిగాడు.

రాజ్యానికి వొళ్ళు మండిపోయింది. 'పడుకుంది' అని జవాబిచ్చి వూరుకుంది.

వేణు 'రాజ్యం నువ్వూరావే వేస్తాను' అన్నాడు.

రాధిక 'మీరెందుకూ మా అన్నయ్య వున్నారుగా. ఆయన కివ్వండి వేస్తారు' అంది నవ్వుతూ. అతను కూడా నవ్వు చెప్పండి రైటేనన్నట్టు తలాడించి, 'ఇదుగో తీసుకెళ్లు' అని సీసా ముందుకు చాపాడు. రాజ్యం భర్తవైపు చూశాడు.

అతను చటుక్కున ముందుకు వొంగి టీపాయ్ మీదున్న పత్రిక చేత్తో పట్టుకున్నాడు.

ఛర్రున కోపమొచ్చింది రాజ్యానికి అన్నగారికి యిట్లా సమాధాన మిచ్చి, చివ్వునలోపలికి పోయింది-"రంగుసీసా

చెయ్యి తీసుకెళ్ళి మీ బావముందు పెట్టినా, ఆయన కంటికి గోళ్ళు అందంగానీ, వేళ్ళు నాజూకుగానీ తెలియదురా. చేతి మీద మీద కాలిన బొబ్బలో కత్తిపీట గాట్లో చూసి రంగుసీసా పక్కనపడేసి పరుగెత్తుకెళ్ళి పెన్సిలిన్ ఆయింట్‌మెంటూ డెట్టాల్ సీసా తెచ్చి పూసేస్తారు."

అదేదో పెద్ద జోక్ అన్నట్టు వేణు పెద్దగా నవ్వితే మూర్తి పేపరులోంచి తలెత్తలేదు. రాధిక నెయిల్ పాలిష్ తీసుకుని గదిలోనికి వెళ్ళిపోయింది.

వేణు మూర్తిని మాటల్లోకి దింపాడు. అయిదు నిముషాలాగి 'నే వెళ్ళాలోయ్' అంటూ లేచాడు మూర్తి.

"వుండు బావా ఇప్పుడేగా వస్తి" అని లోపలికి వెళ్ళి "రాజ్యం బావకు కాఫీ పట్టా" అని కేక వేశాడు.

"వొద్దు వేణూ. అన్నిసార్లు కాఫీ నాకు అలవాటు లేదు" అనేసి వెళ్ళిపోయాడు మూర్తి.

కాస్తాగి పొగలు గక్కుతున్న కాఫీ కప్పుతో వొచ్చిన రాజ్యం అలాగే నిలబడిపోయింది.

o o o

మర్నాడు-

ఏదో పనిమీద బయటికి వెళ్ళిన వేణు యింకా యింటికి రాలేదు. ఒంటిగంట దాటింది. తల్లి, మేనత్త నిద్రలో వున్నారు. రాజ్యానికి ఏమీ తోచక రాధిక గదిలోకి వచ్చింది. రాధిక టేబుల్ మీద రెండు దుప్పట్లు వొత్తుగా పరచి వేణు షర్టులు యిస్త్రీ చేస్తూంది.

రాజ్యం కుర్చీలో కూర్చుంది.

"మీకు మధ్యాహ్నం నిద్రపోయే అలవాటు లేదా?" అంటూ పలకరించింది రాధిక.

"నిద్ర పట్టదు తోచీచావదు" అని క్షణం ఆగి "నువ్వు వుద్యోగంచేస్తావా?" అని ప్రశ్నించింది.

"చదువుకున్నవాళ్ళంతా వుద్యోగం చెయ్యాలని మీ వుద్దేశమా?" ఎదురు ప్రశ్నించింది రాధిక.

"మరి చదువుకోవటం ఎందుకూ?"

"మనచుట్టూ ప్రపంచం తెలుసుకోవటానికి, మనిషిగా నలుగురిలో బ్రతకటానికి"

మాట్లాడలేదు రాజ్యం. ఇస్త్రీ షర్టు మడతపెట్టి పక్కన పెట్టింది రాధిక. చనువుగా "వొదినా నిన్న మీకోసం వొచ్చిన అన్నయ్యని చిన్నబుచ్చి పంపేశారు. నాకు ఎలాగో అన్పించింది" అంది.

"ఆయనొచ్చింది నాకోసమేనేమిటి" నిర్లక్ష్యంగా అనేసి పుస్తకం చేతిలోకి తీసుకుంది.

"మరి"

చేతిలోపని ఆపి చటుక్కున రాజ్యం వైపు చూసిన రాధిక- ఆమె ముఖవైఖరి చూసి తెల్లబోయింది.

"అన్నయ్య మంచివాడనుకున్నారంతా పెళ్ళిలో" షర్టు యిస్త్రీ చేస్తూ మెల్లగా అంది.

'ఎందుకనకోరూ. అందరికీ మంచే. వూరందరికీ అమ్మ. కోడలికి మాత్రం అత్త. నీ కాళ్ళు వొళ్ళో పెట్టుకుని రంగేసే మొగుడు దొరికాడు కాబట్టి నీకంతా మంచిగానే కనిపిస్తారు.' పైకి అనలేదు రాజ్యం.




పుస్తకం పేజీలు తిప్పుతూ వుండిపోయింది.

రాధికకి పెళ్ళిలో జరిగిన సంఘటన కళ్ళముందు మెదిలింది.

పెళ్ళివారి విడిదిలోకి వొచ్చిన మగపెళ్ళివారి తాలూకు ఆడవారిని పెళ్ళికూతురి తల్లి ఎదురేగి తీసుకొచ్చి ఆహ్వానించి భోజనాలమీద కూర్చోబెట్టలేదని అలిగి గిరుక్కున తిరిగి వెళ్ళిపోయారు. పెళ్ళికొడుక్కి వండించిన భోజనం తిరిగొచ్చేసింది. పెళ్ళికూతురి మేనమామలూ, పినతండ్రులూ, కలగజేసుకొని బ్రతిమాలినా లాభంలేకపోయింది. 'ఆవిడ పాతకాలం మనిషి. మగవాళ్ళనీ ఆడవాళ్ళనీ కలిపి వొడ్డించటంవల్ల ఆవిడ బయటకు రాలేకపోయింది' అంటూ ఎంత ప్రాధేయపడినా మగపెళ్ళివారు బిగదీసుకున్నారు. తిరిగిపోయే వరకూ పచ్చిగంగ ముట్టబోమని శపథాలుచేసే వరకూ వెళ్ళారు.

అప్పుడు మూర్తి కల్పించుకొని ముందుకొచ్చి యిరుపక్షాలనీ సర్ది పెళ్ళి సవ్యంగా జరగటానికి కారణమయ్యాడు. అప్పుడు తనే కల్పించుకోకపోతే చిన్న గొడవ చిలికి చిలికి గాలివాన అయ్యుండేదే.

రాజ్యం గదిలోంచి వచ్చేసింది. పాప నిద్రపోతూవుంది. పక్కన పడుకుని పాపను దగ్గరకు తీసుకుని నిద్రపోతూ వుంది పక్కన పడుకొని పాపను దగ్గరకు తీసుకుని నిద్రపోయింది.

○ ○ ○ ○

మూడు గంటలప్పుడు మేనత్త లేపి టీ ఇచ్చింది. టీతాగుతూ 'రజనినిచూసి చాలా రోజులయింది. వెళ్తేనో' అనుకుంది.

పావుగంటలో తయారై గాంధీ చౌక్‌లో వున్న రజని ఇంటికి వెళ్ళింది. రజని ఇంట్లోనే వుంది. రాజ్యాన్ని లోపలకు తీసుకుపోయింది. కబుర్ల మధ్యలో 'రజనీ ఈఏడాదితో చదువైపోతుందిగా.

ఏం చేస్తావు?' అంది.

"చదువయ్యాక వుద్యోగం."

"ఆ తర్వాత?"

"నువ్వడిగేది పెళ్ళిగురించా? అది మా నాన్నా వాళ్ళకి వొదిలేశాను!"

"అనసూయలా నువ్వు లవ్ మారేజి చేసుకోవా?"

"వుహూ. వాటిమీద నాకు నమ్మకం లేదు. హాయిగా పెద్దవాళు కుదిర్చినపెళ్లే చేసుకుంటాను."

"బొత్తిగా ముక్కు మొహం తెలీని వాడ్ని చేసుకుంటే అతని అభిప్రాయా లేమిటీ, ఎటువంటి వాడో ఎలా తెలుస్తుందే? తర్వాత పోట్లాటలు రావూ."

"రాజ్యం, ఆ మాటకొస్తే ఏ యిద్దరి అభిప్రాయాలూ ఒక్కటికావు, సర్దుకు పోవాలి. సంసారం అన్నాక గిల్లికజ్జాలు పెట్టుకుంటూ-మళ్ళీ కలుస్తూ-అలుగుతూ అవమానించుకుంటూ-గడిపెయ్యాలి"

ఎంతో అనుభవమున్న దానిలా రజని చెప్తుంటే అలా చూస్తూ వుండిపోయింది రాజ్యం.

"మీ ఆయన చాలా మంచివాడటగా" అడిగింది రజని.

"నీ కెట్లా తెలుసు"

"విన్నాను."

కాసేపు వూరకుండిపోయిన రాజ్యం 'ఇక వస్తానే. పాపలేచే వేళయింది' అని ఇంటి కొచ్చేసింది.

రావటమే మంచంమీదవాలిపోయింది. కాసేపు కళ్ళుమూసుకుని పడుకుంది. కాసేపు సీలింగుని చూస్తూ గడిపింది. దిగ్గునలేచి దండెం మీద, పరుపు కింద కనిపించినంత మటుకు బట్టలు పెట్టిలో కూరుకుని, పనిపిల్లతో రిక్షా తెప్పించు కుంది.

"అమ్మా, అత్తయ్యా, నే వెళ్తున్నా నాన్నొచ్చాక చెప్పండి" లోపలున్న తల్లికీ, మేనత్తకీ వినపడేలా ఓ కేక పెట్టి పిల్లతో వొచ్చి రిక్షాలో కూర్చుంది.

o o o o

గేటు తీసుకుని లోపలి కొచ్చిన రాజ్యం దృష్టి ముందు వక్కవాటామీద పడింది.

తలుపుకి వేసివున్న తాళం, తెరచి వున్న కిటికీలూ చూసి 'వీళ్ళు ఖాళీచేసి వెళ్ళి పోయారేవిటీ' అనుకుంటూ కిటికీ లోంచి లోపలికి తొంగి చూసింది.

గోడ వక్కగా ఓమడత మంచం వాల్చి వుంది. రెండో వైపు టేబుల్, ముందు ఓ పాత కుర్చీ. గోడ వారగా రెండ ట్రంకు పెట్టెలు. గోడకి వేలాడుతున్న పాంట్లు షర్టులు- వంట గదిలో కూజాలోంచి నీళ్లధారలు కట్టి వున్నాయి.

"అరె. వీళ్లువెళ్ళి పోయారన్న మాట" అని ఒక్క క్షణం అన్పించినా పోన్లే గొడవ వొదిలిపోయింది అనుకుంది.

తలుపు తీసుకుని తన వాటా లోకి వెళ్ళింది. పిల్లని మంచంమీద పడుకోపెట్టి వంటగదిలోకి వెళ్ళి గిన్నెలమీగ మూతలు తీసి,చూసింది. అన్నానికి చీమలు-బెండ కాయవేపుడు బొగ్గులా మాడి వుంది.

"ఏం మనిషో అంతా చాదస్తం. హోటల్లో తింటే పోదూ" అనుకుంది. విసుక్కుంటూనే వంటపూర్తి చేసి, అతని కోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

పది దాటాక వొచ్చాడు మూర్తి.

టాప్ స్టార్ ఉన్న
కప్పు ఏది?



చూడండి, ఇక్కడ
చిక్కని, కమ్మని టీ ఉన్నది

500 గ్రా.,
250 గ్రా.,
100 గ్రా.లో
దొరుకుతుంది.

చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం
రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం

చిక్కదనపు పరీక్షలో లిప్టన్ టాప్‌స్టార్‌దే గెలుపు. చూడగానే తెలుస్తుంది దానిలోని ప్రత్యేకత. తాగగానే తెలుస్తుంది దానిలోని మేలైన రుచి.




# లిప్టన్
# టాప్ స్టార్
# టీ

చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్



రాజ్యాన్ని చూడగానే అతని కళ్ళు తళుక్కున మెరిశాయి

అతని కళ్ళల్లో కాంతిని చూసిన రాజ్యానికి వెళ్ళి అతని వొళ్ళో వాలిపోవాలనిపించింది

స్నానం చేసి వస్తానంటూ అతను తుండు తీసుకుని బాత్ రూంలోకి వెళ్ళిపోయాడు. రాజ్యం చాలా సేపు నిల్చున్న చోటనే వుండిపోయింది

అతని స్నానం అయ్యాక యిద్దరూ కలిసి భోజనం చేశారు. తింటున్నంత సేపూ రాజ్యానికి అన్నావొదినల కబుర్లే.

తెల్లారాక "రాజ్యం ఎప్పుడూ యిట్లా నవ్వుతూ కబుర్లు చెపుతూ వుంటే" అనుకున్నాడు మూర్తి

"మూర్తి నవ్వు రోజూ యిలా వుంటే నీతో పోట్లాడనే పోట్లాడను" అనుకుంది రాజ్యం.

o o o

మూర్తి డ్యూటీకి వెళ్ళిపోయాడు. రాజ్యం వంట గదిలో పని చూసుకుంటుంది,

'ఏమండీ' అన్న పిలుపుకి ముందు గదిలోకి వచ్చింది.

ఎవరో అపరిచితుడు పాప నెత్తుకుని గుమ్మంలో నిలబడి వున్నాడు.

"ఎవరుమీరు?" అన్నట్లున్న రాజ్యం చూపులకు జవాబుగా.

"మీపాప అనుకొంటా, మట్టితింటూ వుంది" అని పాపను దించి "నేను యీ పక్క వాటాలో వుంటున్నాను" అని చెప్పి వెళ్ళిపోయాడు అతను.

రాజ్యం తలుపువేసివొచ్చి పాపనోరు కడిగింది.

ఆ రోజు పనిమనిషి రాలేదు. వంట పూర్తి చేసి పంపుదగ్గర బట్టలుతికి, ప్లాస్టిక్ బకెట్ నిండా నీళ్ళు తెచ్చుకుంటూ నిండు నీళ్ళ బకెట్ బరువనిపించి, కింద పెట్టి పక్కవాట వైపు చూసింది.

అతను ఇంకా నైట్ డ్రెస్‌లోనే ఉన్నాడు.

రాజ్యం అటుచూడగానే 'మీరేమీ అనుకోనంటే ఒకమాట. ఆడవాళ్ళు అంతంత బరువులు మోయటం నేను చూడలేను. అలా వుంచండి. నేను పట్టుకొస్తాను'.

అతను చొరవగా రాజ్యం దగ్గరకు వచ్చాడు.

"వొద్దండీ. తీసికెళ్ళగలను' అంది రాజ్యం మొహమాటంగా.

"మా అమ్మగానీ చెల్లిగానీ అయితే చూస్తూ వూరుకుంటానా? వుండండి" అతను పెద్దబకెట్ అవలీలగా వంటింట్లోకి తీసుకెళ్ళాడు. రాజ్యం వెనకేవెళ్ళింది.

"థాంక్స్" అంది రాజ్యం.

"ఈ మాత్రానికే" అంటూ వెళ్ళిపోయాడతను.

రాజ్యం పొయ్యేగట్టు అనుకుని నిలబడి అరచేయి చూసుకుంది.

వేళ్ళు ఎర్రగా కంది వున్నాయి.

మూర్తి తనిలా నీళ్ళు మొయ్యటం ఎన్నోసార్లు చూశాడు. రాజ్యం ఆలోచనల్లో మూర్తి మెదిలాడు. రోజులు గడుస్తున్నాయి.

రాజ్యం మూర్తిమీద అలిగి వారన్నుంచీ అతనితో ముభావంగా వుంటూ వుంది. మూర్తి తల్లికి బాగుండలేదని




ఉత్తరంవస్తే చూడ్డానికి వెళ్ళాడు.

ం ం ం ం

పాపముందు ఆటవస్తువులు పడేసి ఏదో పుస్తకం చదువుతూ పడుకుంది రాజ్యం. ఎప్పటికో పాపవేపుచూసింది. పాప అక్కడ లేదు. ఆటసామాన్లు చెల్లా చెదురుగా పడివున్నాయి.

'మీరా' అని పిలుస్తూ వంటగదిలోకి పెరట్లోకివెతికింది. పక్కవాటాతలుపులు తీసివుంటే అటువెళ్ళి అక్కడి దృశ్యం చూసి ఆగిపోయింది. అతను మంచం మీద పడుకుని వున్నాడు. పాప అతని గుండెలమీదకూర్చుని ఆడుతోంది. తను బిస్కట్ తింటూ అతని నోట్లో పెడుతోంది. 'మూర్తి ఎప్పుడైనా యిట్లాఆడించాడా?'

అంతలో పాప తల్లినిచూసి "అమ్మ! అమ్మ" అంటూ చేతలు చాపింది.

అతను చప్పున తలతిప్పి వెనక్కి చూసి "పాప కోసం వెతుకుతున్నారా" అన్నాడు లేచి కూచుని

రాజ్యం మాట్లాడ లేదు.

"పాపా వెళ్ళమ్మా" అని అతనంటుంటే పాప గట్టిగా అతన్నే పట్టుకుంది.

అతను నవ్వుతూ రాజ్యాన్ని చూశాడు రాజ్యం తలవంచుకుని వచ్చేసింది యివతలికి.

ం ం ం

పాప అతనికి బాగా మాలిమి అయింది- అతనింట్లో వున్నంత సేపూ అతని దగ్గిరే

"పాపకి పాలువట్టే వేళయింది. వంపుతారా?" అతని వాటా ముందు నిలబడి అడిగింది రాజ్యం.

'పాపా. వెళ్తావా?' అతను అడిగాడు. పాప అతన్ని అతుక్కుంది.

'మీకు పిల్లలంటే యిష్టమనుకుంటా?' ఇద్దర్నీ అలా చూస్తూ అడిగింది రాజ్యం.

"పిల్లలంటే యిష్టపడని వాళ్ళుంటారన్నా నేను నమ్మనుసుమండీ. మీరు నిలబడే వున్నారు" అతను పాపనెత్తుకుని

లేచాడు.

"మీకెందరు పిల్లలు?" తీరా అడిగాక అడక్కుండా వుండాల్సింది అనుకుంది.

"నిజం చెప్పమంటారా? అబద్ధం చెప్పమంటారా?" నవ్వుతూ అడిగాడు.

తమాషాగా మాట్లాడుతాడు అనుకుని "నిజమే చెప్పండి" అంది నవ్వుతూ.

"నాకింకా పెళ్ళి కాలేదు. అందులో కథ కూడా వుంది. చెప్పమంటారా?

"చెప్పండి"

"నో. నో. నేను గదిలోపల. మీరు బయట-మీకు అభ్యంతరం లేక పోతే యిలా వొచ్చి కూర్చోండి. అప్పుడు చెపుతాను." రాజ్యం తటపటాయించింది.

అది గమనించి "మన ఆడవాళ్లు అంతే నండీ, పరాయివాడు పలకరిస్తే చాలు బెదిరిపోతారు. అదే ఫారిన్ కంట్రీస్‌లో చూడండి. నదురూ బెదురూ లేకుండా ఎంత ఫ్రెండ్లీగా వుంటారో" అతనలా అనేసరికి రాజ్యం లోపలికి వొచ్చి, కూర్చీలో కూర్చో బోయింది.

'ఆ. ఆ. ఒక్క నిముషం ఆగండి'. అతను చప్పున అక్కడికొచ్చి, కుర్చీని గోడకి జరిపి "దీనికి కొంత సపోర్టు కావాలండీ, లేక పోతే కూర్చోనివ్వదు" అంటూ గోడకి బాగా ఆనించి

"యిప్పుడు కూర్చోండి" అన్నాడు.

రాజ్యం నవ్వి, కూర్చుంది.

అతను పాపని వొళ్ళో పెట్టుకుని మంచం మీద కూర్చున్నాడు.

"నేను మా అమ్మకి రెండోవాడ్ని మూడో సంతానాన్నండి. అందరికన్నా పెద్ద అన్నయ్య, తర్వాత ఒక అక్క, ఒక చెల్లి. ఆ యిద్దరికీ పెళ్ళిళ్ళు అయి

నాయి వాళ్ళ పెళ్ళిళ్ళఖర్చులూ, కట్నాలూ, నా పెళ్ళి ద్వారా రాబట్టాలని మావాళ్ళ ప్లాను నేను బియ్యే పాసయ్యాను లక్ష కట్నం ఎవరిస్తే వాళ్ళకి అమ్మెయ్యాలని ప్రయత్నిస్తూంటే సహించలేక పోయాను. ఆ లక్ష నేనే సంపాదించి మీకిచ్చాకే నాకు నచ్చిన పిల్లను నేను చేసుకుంటా నని ప్రతాపాలు పలికి యిలా వొచ్చే శాను. చెప్పండి. నే చేసిన పని తప్పం టారా? రైటంటారా?"

అతని ప్రశ్నకి రాజ్యం నవ్వి వూరు కుంది.

"అంత కట్నం తెచ్చిన అమ్మాయి నన్ను గౌరవించదని నా నమ్మకం. అందుకే బాగా సంపాదించాక గానీ పెళ్ళి మాట ఎత్తగూడదనుకున్నాను"

"ఇప్పుడు బాంకులూ, యస్ యఫ్. సిలు రుణాలిస్తున్నాయిగా. ఏదో ఒక యిండస్ట్రీ పెట్టి లక్షలు సంపాదించగల నన్న నమ్మకం వుంది నాకు. అప్పుడే పెళ్ళి"

రాజ్యం వింటూంది.

"నన్ను చేసుకున్నందుకు నా భార్య ఏ క్షణానా బాధపడకూడదు. ఆమెను దేవతలా ఆరాధిస్తాను. స్నేహితురాలిగా అభిమానిస్తాను. అపురూపంగా చూసు కుంటాను. భార్యంటే నా దృష్టిలో పని పాటలు చెయ్యటానికీ, పిల్లల్ని కనిపెట్ట టానికీ కాదు"

"వస్తానండీ" అని పిల్లను అందు కుని వొచ్చేసింది రాజ్యం.

పాపని పడుకో బెట్టి పక్కనే కూర్చుంది.

అతని మాటలు చెవిలో గింగురుమం

టున్నాయి.

"భార్యంటే నా దృష్టిలో పనిపాటలు చేయడానికకాదు దేవతలా ఆరాధిస్తాను. స్నేహితురాలిగా అభిమానిస్తాను"

ఆ సాయంత్రం పూర్ణించి వచ్చిన మూర్తిమీద అకారణంగా విరుచుకు పడింది.

ం ం ం

పెరటిగుమ్మందగ్గర ఏదో పేపరు చదువుతూ నిలబడ్డవి రాజ్యం.

అప్పుడే బాత్‌రూంలోంచి వచ్చి తన వాటాలోకి వెడుతూ "రాజ్యంగారూ, ఏమిటండీ అంత సీరియస్‌గా చదువుతున్నారూ" అన్నాడు.

"డాక్టరుగారు స్వేచ్ఛగురించి తన అభిప్రాయం రాసి చదవమని మా ఆయన కిచ్చారు. ఏం తోచక నేను చదువుతున్నాను" అంది రాజ్యం.

"ఏదీ యిలా యివ్వండి" రాజ్యం దగ్గరికొచ్చి చేతిలో కాగితం అందుకుని అక్కడే నిలబడి చదివి,

"బాగా రాశారండీ. స్వేచ్ఛకోసం ఆయన పడే తపనని ఆరాటాన్నీ బాగా వ్యక్తం చేశారు. ఈ వాక్యాలు చూశారా?" అంటూ కొన్నిటిని ఎత్తి చూపాడు.

"స్వేచ్ఛ అంటే తననుంచి తనను సమాజంనుంచీ విముక్తి. భయంనుంచి వికాసంలోకి. సమగ్రత పైపు, వీడు పుట్టకముందే వీడి మతం స్థిరపడింది. వీడి జీవితానికి న్యాయం నడవాల్సిన హద్దులు ముందే నిర్దేశింప బడినాయి.

పుట్టకముందునుంచీ స్వేచ్ఛకు, స్వతంత్రానికి, చట్టాల మతాల నీతుల మేకులు కొట్టినదెవరు? ఆ శిలువను మోస్తూ బతుకుతున్న మనిషి! మనిషిగా నీకు పునర్జన్మ ఎప్పుడు. నిజం. స్వేచ్ఛ అంటేనాకు తెలిసినవి ఒకే అర్థం. భయం లేకపోవటం. దయచేసి నన్నా ప్రపంచం లోకి వొదిలిపెట్టండి."

"యీయన చలంగారి ఫాలోయరనుకుంటా?"

"ఎలా చెప్పగలరు?"

"మీరు చలంపుస్తకాలు చదవలేదా?"

"ఏమో గుర్తులేదు. ఏది దొరికితే అదే చదివే అలవాటు"

ఉన్నట్టుండి టాపిక్ మార్చాడు సూరి.

"రాజ్యం గారూ. నేను యింట్లోకి వొచ్చినప్పట్నుంచీ అనుకుంటాను మూర్తి గారితో పరిచయం చేసుకోవాలంటే కుదరటంలేదు"

చటుక్కున అనేసింది రాజ్యం "ఇంటికి, నిద్రకేగా ఆయనఇంటికొచ్చేది"

అతను రాజ్యంవు చూశాడు.

"సరిగ్గా మీలాగే ఎందరో ఆడవాళ్ళు భర్తల్ని గురించి చెప్పుకుంటారు. మన భారతదేశంలో అతను తిరుగుబోతు, లంచ్చా ఎవడైనానరే, మూడు ముళ్ళు వేయించుకున్న పాపానికి ఇష్టంలేకున్నా నరే, అతన్నే అంటిపెట్టుకొని పడివుంటున్నారు. ఎందుకు?-నంఘం అంటే భయం.

స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవటం"

రాజ్యం వుదాసీనంగా వుండిపోయింది

"చలం పుస్తకాలు నాదగ్గర కొన్ని వున్నాయి. స్వేచ్ఛ, స్త్రీ స్వాతంత్ర్యం అంటే ఏమిటో మీకు అర్థమవుతుంది. నా దగ్గర చలం మైదానం వుండాలి. వెతికి తీసుకోండి. ఓ, మీతో మాటల్లో




పడితే-టైమే తెలీదు. ఓ ఫ్రెండుని కల వాలి. వెళ్ళాలి'' అంటూ హడావుడిగా వెళ్ళిపోయాడు హరి.

రాజ్యం చేతిలో కాగితంతో అక్కడ్నుంచి లేవలేదు

ఆరాత్రి స్వేచ్ఛను చదివిన రామూర్తి మితిమీరిన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మనిషిని నిర్వీర్యం చేస్తాయెమో అనుకున్నాడు.

ం ం ం ం

రాజ్యం కాస్త మంచి చీరతో అగు పడితే "యీచీర మీకెంతో బాగుంటుందండీ" అంటాడు కాస్త నీరసంగా కన్పిస్తే 'ఏమిటలావున్నారు? వొంట్లో బాగోలేదా?' అని ఆదుర్దా పడతాడు ఆమెకోసం పుస్తకాలు తెస్తాడు వాటిని గురించి చర్చిస్తాడు. ఆమె చేసే ప్రతీపనినీ మెచ్చుకుంటాడు. ఆమె ఒక్కరోజు కన్పించక పోతే "రాజ్యంగారూ నిన్న కన్పించ లేదేం?" అని అడుగుతాడు.

పాప కోసం తినుబండారాలు, ఆట వస్తువులు తెస్తాడు.

రాజ్యం మనోస్థితి చిత్రంగా మారి పోయింది. అతనితో మాట్లాడాలనీ, అతని సాన్నిధ్యంలో గడపాలనీ మనసు వుర కలు వేస్తూవుంటుంది. తన మనోభావాలు అతనికి వెల్లడించుకోవాలని తహతహ లాడుతూ వుంటుంది.

అప్పుడప్పుడు మూర్తి స్థానంలో హరి తన భర్త అయివుంటే అన్నవూహాలు వస్తాయి.

మంచం మీద కూర్చుని పఠనాన్ని మర్చిపోయి వూహాల్లోకి వెళ్ళిపోయింది రాజ్యం

"స్వరాజ్యం" మూర్తి పిలిచాడు

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

'ఏం లేదు'

పూరికే పడుకుని వుండి పోయింది.

ం ం ం

ఓరోజు మధ్యాహ్నం హరి రాజ్యాన్ని

పిల్చి 'రాజ్యంగారూ. ఎడ పోకుండా త్వరగా రెడీ అవండి. కెమేరా తెచ్చాను. వి.మ్మల్ని పాపనీ ఫోటోలు తీస్తాను' అన్నాడు.

రాజ్యం పావు గంటలో తయారై బయటికివొచ్చింది. అతను పెరట్లో కెమేరాతో సిద్ధంగా వున్నాడు.

రాజ్యాన్ని చూడగానే అతను చూపు తిప్పుకో లేక పోయాడు.

రెప్పవాల్చకుండా చూస్తూ వుండి పోయాడు

రాజ్యానికి అడుగు పడలేదు. మెట్ల మీదనే ఆగిపోయింది.

అతని చూపుల్లో ఏదో ఆకర్షణ. సూటిగా. వాడిగాగుండెల్ని తాకే ఆచూపు రాజ్యాన్ని స్పందింప జేస్తూంది. సంచలనాన్ని రేపుతుంది ఆమెలో.

రాజ్యంచూపులు నేలకు అంటుకు "రాజూ" చిన్నగా పిలిచాడు అతను తనపేరు అంత బాగుంటుందా? మెల్లగా కళ్ళెత్తింది

ఆమె తను మనోప్రాణాలు పువ్వులా వికసించాయి.

అతను సంబాళించుకుని 'సారీ. రండి' అన్నాడు.

రాజ్యం అడుగులో అడుగేసుకుంటూ వొచ్చినిలబడింది.

"ఇక్కడ కాదు. అటు" అంటూ అతను రాజ్యాన్ని చెట్లుబాక్గ్రౌండులో వొచ్చేలాగా నిలబెట్టి యిద్దర్నీ కలిసికొన్ని విడివిడిగా కొన్ని ఫోటోలు తీశాడు

"రేపిపాటికి ఫోటోలు తెచ్చి చూపిస్తాను. మీకోసం ఓ ఫ్రెండును అడిగి తెచ్చాను."

"ఇతనికి కాబోయే భార్య ఎంత అదృష్టవంతురాలో" అనుకుంది రాజ్యం లోనికొస్తూ.

నాలుగింటికి యింటికొచ్చిన మూర్తి రాజ్యం తయారై వుండటం చూసి "సినిమాకి వెళ్తున్నావా?" అనేసి హడావుడిగా వెళ్ళిపోయాడు

రాజ్యం మూర్తినీ, హరినీ పోల్చి చూసుకుంది.

○ ○ ○

"మదర్ సీరియస్ స్టార్ట్ యిమిడియట్లీ" అన్న టెలిగ్రాం చూసుకుని రాజ్యాన్నికూడా బయలుదేరమన్నాడు మూర్తి.

"ఆ వూళ్ళో నేను ఒక్క గంటకూడా వుండలేను బాబూ. నువ్వెళ్ళిరా" అంది రాజ్యం మూర్తి వెళ్ళిపోయాడు

రెండ్రోజుల తర్వాత "మూర్తిగారు కన్పించటంలేదు. వూర్లో లేరా?" అని పలకరించాడు హరి.

"వాళ్ళమ్మకి బాగ లేదని చూట్టానికి వెళ్లారు" జవాబిచ్చింది రాజ్యం

ఆరోజుామర్నాడూ పెక్కవాటా తలుపులు తెరిచివున్నా హరి బయట కన్పించలేదు పాప చాలా సార్లు లోపలికెళ్ళి తిరిగొచ్చేసింది రాజ్యానికేమీ తోచలేదు.

"ఒకవేళ వొంట్లో బాగోలేదా? జ్వరంగానీ వొచ్చిందా? పాపం వొంటరిగా వుంటున్నాడు కూడాను" అనుకుంటూ లోపలికెళ్ళింది. అతను పడుకుని వున్నాడు. చిన్నగా మూలుగు విని పిస్తూంది. లోపల లైటుకూడా లేదు. లైటు వేసి మంచం దగ్గరగా వెళ్ళి చూసింది. మోచేతి వొంపులో ముఖం




దాచుకుని నిద్రపోతున్నాడు

"హరీ" మృదువుగా పిలిచింది.

పలకలేదు.

మంచంపక్కనే నిలబడి కొంచెం వొంగుని "హరీ" అంటూ మళ్ళీ పిలిచింది. అతను "వూ" అంటూ మొహం మీది చెయ్యి అడ్డు తొలగించిచూశాడు.

కళ్లు ఎర్రగా వున్నాయి మొహం వాడి కందిపోయి వుంది.

"జ్వరం వచ్చిందా?" అప్రయత్నంగా చేత్తో అతని నుదుటికి తాకింది. వెచ్చగా వుంది.

"జ్వరం వొస్తే నాకెందుకు చెప్పలేమా?" అతని కళ్ళల్లోకి అభిమానంగా చూసింది. అతను చిరునవ్వు నవ్వాడు.

"కాఫీ తెస్తా వాగండి" అంటూ రాజ్యం తమ పోర్షన్‌లోకి వెళ్ళి స్టౌవెలిగించి కాఫీ కలిపి ఓ జ్వరం మాత్రతో తిరిగొచ్చి అతనితో తాగించింది. అతను కృతజ్ఞతగా రాజ్యాన్ని చూసి 'ఇక వెళ్ళండి' అన్నాడు

రాజ్యం వొచ్చేసినా ఆ రాత్రి ఆమెకు నిద్ర రాలేదు. మర్నాడు ఉదయానికంతా అతనికి జ్వరం దిగిపోయింది

రాజ్యం అతన్ని చూడటానికి వెళ్ళింది.

"థాంక్స్. మీచేతి మాత్రకి, కాఫీకి, జ్వరం దిగిపోయింది' అన్నాడు.

ఆ మధ్యాహ్నం హోటలు భోజనం వొద్దని రాజ్యం తనే వంటచేసి పెట్టింది. ఆ సాయంత్రానికి అతను మామూలుగా అయిపోయాడు. పాపని నిద్రపుచ్చి, ఏమీ తోచక ఏం చేస్తున్నాడోనని అతని వాటాలోకి తొంగిచూసింది

మంచంమీదపడుకుని ఏదో పుస్తకం చదువుతున్నాడు. గది గుమ్మం వరకూ వచ్చి ఆగిపోయింది.

అడుగుల చప్పుడికి అతను పక్కకు తిరిగి చూశాడు. రాజ్యాన్ని అలా చూస్తూ వుండిపోయా . రాజ్యం ఇబ్బందిగా ఫీల్ అయినా వెళ్ళలేక, వుండలేక అలాగే నిలబడిపోయింది.

"రాజూ" మందస్వరంతో పిలిచాడు.

"ఇలారా"

అడుగులో అడుగేస్తూ అతన్ని సమీపించింది. చేయిపట్టుకుని పక్కన కూచోబెట్టుకుని కళ్ళల్లోకి చూశాడు.

"రాజూ నువ్వు నాకు కావాలి" అంటూ రెండుచేతులూ ఆమె భుజాల మీదవేసి మీదికి లాక్కున్నాడు. అదురుతున్న గుండెలతో తమకంగా అతని గుండెలమీద వాలిపోయింది రాజ్యం.

అతను ఏవేవో మాటలు గుసగుసలు చెప్పాడు రాజ్యం చెవిలో. స్వర్గం చూపించాడు మాటల్లో.

ఆరాత్రి తిరిగి తన వాటాలోకి వెళ్ళలేదు రాజ్యం

o o o

బతకదనుకున్న తల్లి కోలుకోవటంతో మనస్థిమితం చిక్కి యింటికి తిరిగొచ్చాడు. మూర్తి తలుపుకి వేసివున్న తాళంచూసి రాజ్యం పుట్టింటికి వెళ్ళివుంటుందనుకుని మరురోజునుంచి డ్యూటీకి వెళ్ళసాగాడు. వారం గడిచినా రాజ్యం రాకపోయేసరికి తనే మామగారింటికి వెళ్లాడు.

రాజ్యం రాలేదని తెలిసింది

ఇంటికొచ్చి రాజ్యం పెట్టెలు వెతికి నిశ్చేష్టుడయ్యాడు.

ఆమర్నాటికంతా రాజ్యం లేచిపోయిందన్న వార్త వూళ్ళో సగంమందికి తెలిసింది.

చెంచయ్య కూతురు చేసిన పనికి తలెత్తుకోలేకపోయాడు వీధిలోకి వొచ్చి నలుగురికీ ముఖం చూపించాలంటే అతనికి తలకొట్టేసినట్టుగా వుంది. నాలుగు రోజులు అడితీ తెరవలేదు తల్లి, మేనత్త నెత్తీనోరూ బాదుకుని కుళ్ళి కుళ్ళి ఏడ్చారు. అన్నలు అసహ్యించుకున్నారు. హైదరాబాదులో వుద్యోగం చేస్తున్న వేణు "నాన్నగారూ, మీరు అక్కడ వుండలేననుకుంటే యిక్కడికి వొచ్చెయ్యండి. తమ్ముళ్ళకి వుద్యోగాలకి యిక్కడే ఎలాగో ప్రయత్నాలు చేద్దాం. అది మీ కడుపున పుట్టిందన్న సంగతి మర్చిపొండి. నన్నొచ్చి ఏర్పాట్లు చెయ్యమంటే చేస్తాను" అని తండ్రికి ధైర్యం చెపుతూ రాశాడు అతను.

పదిహేను రోజుల్లో అడితీ అమ్మేసి చెంచయ్య హైదరాబాదుకి మకాం మార్చాడు.

o o o

మూర్తికి వుద్యోగం ఒక్కటే వుపశమనం కల్గిస్తూంది.

తీరిక వేళల్లో ఎడతెగని ఆలోచన.

o o o o

మాధవి రాయడం ఆపి కూర్చుండిపోయింది. ఇంతవరకు రాసింది జరిగిన కథ. ఇకమీద కథ ఎలా జరగనున్నదో.

మూర్తి జీవితం ముందుముందు ఎలా వుంటుంది?

అతను మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడా? అతను భాగ్యను అర్థంచేసుకోలేని మూర్ఖుడేమీ కాదు రాజ్యం అంటే అతనికి ఇప్పటికీ అభిమానం వుంది.

అయితే వుద్యోగాన్ని సక్రమంగా

చెయ్యటం ఒక టేగా అతని బాధ్యత? తన్ని నమ్ముకున్న తన వాళ్ళని సుఖ పెట్టటం సంతోష పెట్టటం తన ధర్మంగా బాధ్యతగా గుర్తెరగవద్దూ?

మరి ఆమెను నిజంగా ప్రేమించే తీసుకుపోయాడా?

మోజు తీరాక వదిలేస్తే? మగవాడి అంగలేకుండా ఆ తటి జీవించగలిగే ఆరోగ్యకరమైన వాతావరణం మనకు వుందా? రాజ్యం వచ్చిపోతుందా?

మరి మీరా?

పిల్లలకోసం బతకాలనుకుంటేరాజ్యం వొళ్ళమ్ముకుంటుందా? ఉహూ. అలా జరక్కూడదు.

పతితగామారిన ప్రతిస్త్రీవెనుకా ఒక కథ వుండే వుంటుంది.

రాజ్యం ఒకవేళ తిరిగొస్తే....

మూర్తి స్వీకరిస్తాడా? ఎప్పటిలా ఆమెను ఆదరిస్తాడా?

అంత ధైర్యం వుంటుందా?...

మాధవి తిరిగి కలం చేతిలోకి తీసుకుంది.

o o o o

ఆరోజు ఆగస్టు 15. దేశానికి స్వాతంత్ర్యం వొచ్చినరోజు.

ఆ సాయంత్రం....ఆకాశం మేఘావృతమైవుంది.

ఇప్పటికో ఇంకాసేపటికో వర్షంవచ్చే సూచనగా గాలి విసురుగా వీస్తోంది. కిటికీ రెక్కలు టపటప కొట్టుకుంటున్నాయి.

మూర్తి పడకుర్చీలో వాలి ఆరోజు పేపరు చదువు తున్నాడు.

పురుగులు లోనికి వస్తున్నాయి. దీపం చూట్టూ ముసురుతున్నాయి. ఆ ప్పుడప్పుడు రెక్కలూడిన పురుగులు అతని మీద పడుతున్నాయి.

అతను వాటికి కాస్త దూరంగా కూర్చొని జరుపుకుని కూచున్నాడు.

సన్నగా జల్లు మొదలయింది.

అతను పేపరు చదవటం ఆపి ఆలోచనలో పడ్డాడు.

మతకలహాలు- దోపిడీలు- మానభంగాలు- తిరుగుబాట్లు-

గేటు చప్పుడకి, ఆలోచనల్లోంచి బయటికొచ్చి, చప్పున పేపరులోంచి ముఖం పైకెత్తి చూశాడు.

ఎవరో ఆడమనిషి -

తలమీదుగా కొంగు. భుజాన పిల్ల

బయట చీకటిగా వుండటాన అవ్యక్తి ఎవరైనదీ పోల్చుకోలేక పరీక్షగా చూశాడు.

ఆమె గేటుదగ్గిర్నుంచి మెట్లెక్కి గదిలోకి నాలుగడుగులే అయినా-ఆ నాలుగడుగులూ వెయ్యటానికి ఎ తోసేపు పట్టింది.

గుమ్మందగ్గిర తలదించుకుని నిలబడింది.

"స్వ-రా-జ్యం" అనుకున్నాడతను

అలాగే చూస్తూ వుండిపోయాడు.

స్వరాజ్యం తిరిగొచ్చేసింది - అంటే- అపును-అంతే.

అతను ఆమెకు భర్త కాలేక పోయాడు.

దీపం పురుగులు మెడమీద తలమీద పడుతుంటే దులుపుకుంటూ లైటుకేసి చూశాడు. వందలసంఖ్యలో అవి దీపం చుట్టూ తిరుగుతున్నాయి.




భ్రమతో-భ్రాంతితో-ఆ కక్క దేదో దొరుకుతుందనే ఆశతో.

రెక్కలు రాలగానే నేలమీద పడిపోతున్నాయి.

అతను రాజ్యం మీదకి చూపు మరల్చాడు.

రాజ్యం అలాగే నిలబడింది

తనముందు నిలబడిన స్వరాజ్యం తప్పుచేసిన వ్యక్తి. దోషి.

అందుకే ఆమె సిగ్గుతో-అభిమానంతో తలెత్తి పలుకరించే సాహసం చెయ్యలేక గడపవతలే ఆగివుంది.

ఇప్పుడామె బ్రతుకంతా తనమాట మీద ఆధారపడివుంది.

ఆమె భవిష్యత్తుకు తాను కర్త.

అతని ఆలోచనలు తీవ్రంగా సాగుతున్నాయి

తాను ఆమె చేసిన తప్పు చెయ్యలేదు గనక నీతి వంతుడు. గౌరవనీయుడు.

తను నిరాకరిస్తే ఆమె భవిష్యత్తు-

అతని ఆలోచనలు ఎంతో దూరం వెళ్ళాయి. రాజ్యాన్ని చూశాడు. నిశ్శబ్దంగా ఏడుస్తోంది.

బలహీనతకు రాగద్వేషాలకు అతీతంగా ఉండే మనిషి దేవుడు.

స్వరాజ్యం మామూలు మనిషి కనుక బలహీనతలకు లొంగిపోయింది. జయించలేక పోయింది.

స్వార్థానికి వ్యక్తిత్వానికి మధ్య పోరాటం జరిగింది.

అతని ఆలోచనల్లో మనస్సులో—

మంగ గుర్తుకొచ్చింది

మంగ మద్దూరులో తమ పక్కింట్లో వుండేది. చిన్నప్పట్నుంచీ తనతో కలిసి ఆడేది బడికి వెంటనే వచ్చేది దారిలో గిల్లి కజ్జాలు పెట్టుకునేది. కొట్టేది.

ఆ వూళ్ళో తన చదువు అయిపోయింది. పెద్ద చదువులకు వెళ్ళలేకపోయాడు.

ఏదయినా వుద్యోగం చూసుకుంటానని తల్లిదండ్రులకు చెప్పేశాడు.

అప్పుడు మంగకు సంబంధాలు చూస్తున్నారు. మంగకు పెళ్ళి కుదిరిందని చెప్పిందని చెప్పింది తల్లి. విని వూరుకున్నాడతను.

ఆ రోజు రాత్రి మంగ ఆరుబయట పడుకున్న తన్ను మంగలేపి చెట్టు చాటుకు

తీసుకుపోయింది.

"మూర్తీ నన్ను నీతో ఎటయినా తీసుకుపో. మనిద్దరం హాయిగా బతకొచ్చు. నాకు ఈపెళ్ళి ఇష్టంలేదు. నిన్ను చేసుకుంటానంటే వాళ్ళు ఒొప్పుకోవటం లేదు. నువ్వు ఒొప్పుకోకపోతే బావిలో అయినా పడి చస్తాగానీ ఆ పెళ్ళిమాత్రం చేసుకోను. ఆడపిల్లని ఇంత ధైర్యంచేసి అడుగుతుంటే మగవాడివి సాహసించలేవా? నిన్ను ప్రేమించాను కనుక నే ఇంతగా ప్రాధేయపడుతున్నా" అంటూ చాలా ప్రతిమాలింది.

"తప్పు. ఎవరన్నా చూస్తే బాగుండదు. నువ్వుముందువెళ్ళిపో" అని ఆమెను బలవంతంగా పంపేశాడు. ఓ గంట తర్వాత లమ్మ గాభరాగా లేపింది. 'మంగ నూతిలోపడి ప్రాణాలు తీసుకుందిరా' అంటూ

అచేతనంగా అలావుండి పోయాడు తను,

మంగ అన్నంత పనీచేసింది. మంగ చావుకి తనే కారణమనుకుంటే మనసంతా కెలికికట్టుకుంది.

అమర్నాదే వుద్యోగానికై వొచ్చేశాడు సరిగ్గా స్వరాజం చేసిన తప్పే చెయ్యక పోయినా తన మహానుభావుడేమీకాదు

ం ం ం

వెక్కి వెక్కి ఏడుస్తోంది రాజ్యం.

"స్వరాజ్యం. లోపలకురా" పిల్చాడతను

స్వరాజ్యం దిగ్గునతలెత్తి ఆశ్చర్యంగా చూసింది

'నిజంగా_ నిజంగానే అంటున్నారా ఎగతాళికా?'

అతని గొంతు అలా ధ్వనించలేదు.

అతనిముఖం ఎప్పటిలాగే ప్రశాంతంగా-గంభీరంగా వుంది.

ఆమె సంభ్రమాశ్చర్యాలనుంచి తేరుకోలేదు

అతనులేచాడు-దగ్గరగా వొచ్చిభుజం మీద చేయి వేసి పావను అందుకున్నాడు.

ఆమె అతని వెనకే వొచ్చి గది మధ్యలో ఆగి పోయింది.

అతను ఆమెను మంచంమీద పడుకోబెట్టి దుప్పటి కప్పి వెనుదిరిగాడు.

ఆమె అతనివైపు తడికళ్ళతో చూస్తూవుంది.

అతను ఆమె కళ్ళల్లోకి సూటిగా చూశాడు

ఆచూపుల మెకు ధైర్యాన్ని బలాన్ని యిచ్చాయి

హృదయపు లోతులను స్పృశించాయి.

పరివర్తనతో ఆమె హృదయం కంపించింది

మనసులో వ్యధ, చేసిన పాపం కన్నీటి రూపంలో ప్రవహించాయి.

ఆమె అతని కాళ్ళకు చుట్టుకు పోయింది.

"రాజూ నేను మామూలు మనిషిని. నిన్ను శిక్షించే అర్హత లేనివాడ్ని కాబట్టే క్షమించటం నా ధర్మం"

అనుకుని ఆమెను లేవనెత్తాడు

కృతజ్ఞతతో ఆమె మనసు నిండి పోయింది. అతని మంచి మనసుకి ఆదరణకీ తట్టుకోలేక కన్నీరు చెక్కిళ్ళమీదుగా జారింది.

అతనామెను హృదయానికి హత్తు

కున్నాడు

ం ం ం ం

కథ ప్రాయం ముగిసే సరికి గడియారం రెండు గంటలు కొట్టింది

మాధవి, రాసిన కాగితాల బొత్తి మీద పేపరు వెయిట్ వుంచి బద్ధకంగా లేచి కళ్ళు మూసుకుని మాధవి గదిలో యింకా లైటు వెలుగుతుండటం చూసి నరేంద్ర మాధవి గదిలోకి వచ్చాడు.

మాధవి కళ్లు మూసుకుని పడుకుని వుంది

టేబిల్ మీది కాగితాలు ఫ్యాను గాలికి రెపరెప మంటున్నాయి

ఇంత రాత్రి వరకూ కూర్చుని మాధవి రాసిన విషయం ఏమిటి?

కుతూహలంతో అతను కాగితాలు చూశాడు.

వెలుగురేఖ కథ, అతను అక్కడక్కడా చదివి, కథ పూర్తిచేసి కానేపు కాగితాలకేసి చూస్తూ వుండిపోయాడు.

"ఉద్యోగ ధర్మానికి న్యాయం చేకూర్చటం ఒక డాక్టరుగా తన బాధ్యత అతన్ని నమ్ముకున్న తన వాళ్ళని సుఖపెట్టటం తన ధర్మంగా బాధ్యతగా గుర్తెరగవద్దూ "

ఆ వాక్యంమీద అతని చూపులు నిలచిపోయాయి మనసు ముల్లు గుచ్చుకున్నట్లుయింది నిజమే పదేళ్ళక్రితం ... మాధవి, బాబు, తమతో చిన్న ప్రపంచం ఎన్నో ఆశలుండేవి. కలలుండేవి, ఓ చిన్న యిల్లు కట్టుకోవాలి ఆ ఇంట్లో వొద్దికగా కాపురంవుండాలి. చదివిన డాక్టరీవృత్తిని వ్యాపారంగా మార్చుకోగూడదు. ప్రజాసేవకి జీవితం అంకితం చేయాలి. ఎన్నో ఆలోచి మాధవి ఎంతగానో సహకరించేది తనకు సలహాలిచ్చేది, తన అభివృద్ధికి సోపానమై నిలిచింది. అలాటి మాధవితో మాట్లాడటానికి తనకీనాడు తీరిక వుండటంలేదు

ప్రాక్టీసు బాగా పెరిగింది. నర్సింగ్ హోమ్ కట్టాడు రెండు క్లినిక్ లు-రెండు లాబొరేటరీలు అయ్యాయి. తానిప్పుడు లక్షాధికారి పదిలక్షల పెట్టుబడితో ఇండస్ట్రీ తెగవాలనుకుంటున్నాడు. ఇంకా తృప్తి లేదు అనుక్షణం అర్జన మీదే దృష్టి. తన లక్ష్యం సంపాదనే. అంతే తానీ తనకు తెలియకుండానే మాధవికి దూరమవుతూ వచ్చాడు. తనవాళ్ళతో మాట్లాడే వ్యవధి వుండటంలేదు. టిఫిన్ తీసుకునేటప్పుడు, భోజనం సమయంలో - ఓ పది నిముషాలు-అతనికి గడిచిన రోజుల తాలూకు మధు స్మృతులు గుర్తుకు వచ్చాయి.

కాగితాల మీద వెయిట్‌వుంచి యిటు అటునుంచి ఇటు తిరిగాడు.

మాధవి అతని వంకే చూస్తోంది.

అతని చూపులు మాధవి చూపుల్లో కలిశాయి.

"మాధవీ; నేను పూర్తిగా మర మనిషిని అయిపోకముందే నలో మనిషిని మేల్కొల్పావు కృతజ్ఞుడిని" పెదవి విప్పి చెప్పకోలేని మాటల్ని కళ్ళతో నివేదించుకున్నాడు

మాధవి సన్నని పెదవులు బిగించి, చిన్నగా నవ్వింది

గుండెల్లో నిండిన ఆనందం కళ్ళల్లో ప్రతిఫలిస్తూంది. తన వైపు నడచివస్తున్న భర్తను చూస్తూ వుండిపోయింది.★

# శారదా! నన్ను క్షమించవూ!!

కోడూరి శేషఫణిశర్మ

శారదకి పిల్లలేరు. ఆ మాటకొస్తే ప్రపంచంలో పిల్లలు లేనివాళ్లు చాలామంది వున్నారు. అయినా వాళ్ళెవళ్ళకీ శారద కొచ్చినంత ప్రచారం రాలేదు. కారణం మాత్రం వెరీ సింపుల్! చుట్టుపక్కల వున్నవాళ్ళకి ఆ విషయం తప్ప మరో విషయం దొరకడంలేదీమధ్య మాటాడ కొనేందుకు.

"మా కోడలుపిల్ల మీద మీద మూడు కాన్పులు కనేసింది. నీకింకా ఏమీ అనుకోలేదేమిటే శారదా!" ఓ పనిలేని పాపాత్తమ్మ ఆరా తీస్తుంది.

"గవర్నమెంటువారు 'ఒకరో యిద్దరో' అన్నారు కానీ మరీ అసలే కనవద్దనలేదమ్మాయ్! కాస్త త్వరపడు మరీ!" తన పరిజ్ఞానాన్ని జోడిస్తూ సలహా పారేస్తుంది ఓ పక్కింటి పిన్నిగారు.

ఇంతవరకూ లేని ఏదో వెలితి యీ మాటల్లో కనబడసాగింది శారదకి. జవాబేం చెప్తుంది?

శారదా కృష్ణమోహన్‌ల పెళ్ళి జరిగి ఆరేళ్ళయింది. రెండేళ్ళ క్రిందటివరకూ పిల్లల సంగతి యిటు యీ దంపతులకి కానీ అటు యిరుగుపొరుగువారికి కానీ పట్టనేలేదు.

ఇదిగో యీ వూరికి ట్రాన్స్‌ఫర్ అయి వచ్చింది మొదలు యిదొక పెద్ద సమస్య అయింది ఆ కాలనీలో.

పేరకి అదొక సివిలైజ్‌డ్ లొకాలిటీ. అయినా సివిలైజేషన్ ఛాయలు ఆ ప్రాంతాల్లోకి యింకా చొరబడలేదు. ఎటొచ్చీ చేతినంచి సైజులో వానిటీ బ్యాగ్‌లూ, హెయిర్‌క్లిప్పులూ, బన్నులూ, చీరల రంగుతో మాచ్ అయ్యే ప్లాస్టిక్ నదుటి బొట్లూ, పాదాల శక్తికి మించిన బరువుగల హైహీలు చెప్పులూ చాలా వేగంగా ఆ కాలనీలో చోటు చేసుకొన్నాయి.

అన్ని టౌన్లలోలాగే ఇక్కడా యీ సరుకంతా సాయంకాలమయేసరికి ఎవరో ఒకరి యింట్లో చేరుతుంది. చేరింది మొదలు 'యిదిగో యీ శారద యిలాగ, ఆ నీరద అలాగా' అని పనికిరాని కబుర్లేసుకూర్చుంటుంది.

మొదటమొదట యీ మాటల్ని పట్టించుకునేది కాదు శారద. వినీవినీ పిల్లలు లేకపోవడం ఓ పెద్ద నేరంలాగా, తననో నేరస్తురాలిగా భావించుకోసాగింది.

ఇంతవరకూ ఎంతో అభిమానంగా, ఆదరంగా చూసుకొంటున్న శారద అత్త సుభద్రమ్మగారికూడా యీమధ్య మనవణ్ణో, మనవరాల్నో ఎత్తుకోవాలనీ, వాళ్ళ ముద్దూముచ్చటా చూడాలనీ కోరిక మొదలయింది.

కృష్ణమోహన్‌కి యిదేమీ పట్టడం



లేదు ప్రొద్దుటే పదిగంటలకి భోజనం చేసి బ్యాంక్‌కి వెళ్ళినవాడల్లా తిరిగి రావటం రాత్రి ఎనిమిది గంటలకే. అసిస్టెంట్ మేనేజరుగా ప్రమోషన్ వచ్చిన దగ్గర్నుంచీ యిదే వరస.

అంతకుముందు శారదా, కృష్ణమోహన్‌లు కలిసి నెలకి మూడో నాలుగో సినిమాలు చూసేవారు. ఈమధ్య అసలు కుదరటమే లేదు.

వీటన్నిటి వల్లా శారదకి ఏకాకితనంలో కొట్టుమిట్టాడినట్లయ్యింది. భర్తతో చూచాయగా తన వెలితి సంగతి చెప్పింది. అతడు చాలా తేలిగ్గా తోసేశాడు.

“చూడు శారదా! సుఖవంతమయిన జీవితంలో సంతానం కూడా పాత్ర వహిస్తుంది. నిజమే, కానీ సంతానమే సుఖవంతమయిన జీవితం మాత్రం కాదు. ఎందుకలా దిగులు పడి పోతావ్ మన



కింకా వయసు మళ్ళిపోలేదు కదా!" కొంటెగా చూశాడు కృష్ణమోహన్

"పొద్దుననగా వెళ్ళి రాత్రి ఎప్పుడో యింటికి చేరుకొంటారు. నాచుట్టూ ఎన్ని మాటలు యీ చెవులు వినరుతున్నారో మీకేం తెలుసు?" శారద ముఖం చిట్లించింది.

"అదా సంగతి! నీవంతు కూడా వాళ్ళనే కనమను దెబ్బతో నోరుమూసుకుంటారు"-కృష్ణమోహన్ మాటలకి ఏం చెప్పాలో తోచలేదు శారదకి

సీరియస్‌గా దీని గురించి ఆలోచింపజేయడమెలాగో తెలియలేదామెకి. ఎంత సేపూ నవ్వులూ ఏదో జవాబు చెప్పి నవ్విస్తాడే తప్ప ఆలోచించడు.

చిన్న పిల్లల్ని చూసి నవ్వడల్లా మనసులో గూడు కట్టుకొన్న లోటు వస్తంతలుగా కనిపిస్తుంది మొన్న షష్టికి వెళ్ళినపుడు వదిన సుమిత్ర కానుపయ్యిందట! మగపిల్లాడు.. ఎంత ముద్దుగా, బొద్దుగా వున్నాడో! ఎర్రగా ఆపిల్ పండులా వుండి చూడగానే ఎత్తుకుందామనిపించేలా వున్నాడు

వదిన నడిగి వళ్ళో పడుకో బెట్టుకుంది

"పూరికే ముచ్చట పడిపోవటమేనా శారదా! అల్లుడికోసం కూతుర్ని ఎప్పుడిస్తావ్!" అంది సుమిత్ర.

చిరునవ్వు నవ్వి పూరుకంది శారద.

అప్పట్నుంచి మనసులో దిగులు మరీ ఎక్కువయింది.

పిల్లలుంటే ఎంత బాగుంటుంది! వాళ్ళ ముద్దు మాటల్లో, చిలిపి పనుల్లో ఎంత హాయి! ఇట్టే నేదదీరి శ్రమనంతా మరచిపోవచ్చు.

యూనిఫారంవేసి పిల్లల్ని కాన్వెంట్‌కి నడిపించుకువెళ్ళే తల్లుల్ని చూసి తనకా వరదా తీరే భాగ్యముందా అని హృదయం బాధగా మూలుగుతుంది!

ముచ్చటగా ముస్తాబు చేసి పిల్లల్ని సాయంకాలాలు షికారుకి తీసుకుపోతున్న జంటల్ని చూస్తే ఏదో తెలియని ఆవేదన మనసుని కలచివేసేది

దీనికితోడు సుభద్రమ్మ యీ మధ్య ప్రత్యక్షంగా యీసడించుకోవడం మొదలెట్టింది ఇంటికొచ్చిన వారితో ఏ మాట మాట్లాడినా కోడలికి సంతానంలేదన్న విషయంవైపే సంభాషణ తిరుగుతుంది.

"సుభద్రమ్మా! యీరోజు ఏం వంట మీ ఇంట్లో?"

"ఏదో లెండి! పిల్లా, పాపా? ఎవరున్నారు గనుక? ఏదో చేశాం. తిన్నాం!" జవాబిస్తుంది సుభద్రమ్మ.

వినలేక శారదకి కన్నీళ్ళు పర్యంతం అయ్యేది.

భరించలేక ఓరోజు రాత్రి భర్తదగ్గర ఏడ్చేసింది శారద

"అందరూ అనటమే కాదు. నాకూడా అనిపిస్తుంది. పిల్లల్లేని లోటు అడుగడుగునా కనిపిస్తూంది .. మీరన్నట్టు సంతానమే సుఖవంతమయిన జీవితంకాదు. అయితే .. మన సుఖవంతమైన జీవితంలోకి బాబో, పాపో వస్తే ఇంకా బావుంటుంది" అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ.

అర్థం చేసుకొన్నాడు కృష్ణమోహన్.

"నీవింతగా బాధపడుతున్నావని తెలియదు శారదా! ఊరుకో....డాక్టర్ శైలజ దగ్గరికెళదాం రేపు."




దగ్గరగా తీసుకొని అనునయించాడు.

గువ్వలా ఒదిగిపోయి తాత్కాలికంగా బాధని మరచిపోయింది శారద.

○ ○ ○ ○

మరునాటిరోజు బ్యాంకుకి సెలవుపెట్టి శారదని డాక్టర్ శైలజ దగ్గిరికి తీసికెళ్ళాడు కృష్ణమోహన్.

శారదని లోపలికి తీసికెళ్ళింది డాక్టర్!

వెయిట్ చేస్తూ బయట కూర్చున్నాడు కృష్ణమోహన్!

ఇంతవరకూ ఎలావున్నా తీరాభార్యని తీసుకొచ్చి ఇలా పరీక్ష చేయించాల్సివచ్చే సరికి అతని మనసంతా బాధగావుంది!

సంతానం లేకపోవడం నిజంగా లోటుగా అనిపించింది మగవాడికి తనకే ఇలా అనిపిస్తూంటే పాపం శారద కెలా వుందో! మనసులో ఎంతగా బాధపడుతూందో? ఎన్నడూ లేంది నిన్న రాత్రి కళ్ళనీళ్ళు పెట్టుకుంటే తనకు ఆదోలా అయింది.

మాతృత్వంపై స్త్రీకెంత మక్కువ!

ప్రసవమనేది మరో జన్మ ఎత్తినట్టని తెల్సినా ఎంత తాపత్రయం!

అన్నిటినీ మరిపించేంతటి గొప్పదా మాతృత్వం!

పిల్లలు కలగటంతోనే తీరిపోదు! వారి పెంపకంలో ఎన్ని సాధక బాధకాలు?

అయినా మాతృత్వం కోసం ఆరాటపడతారంటే అది స్త్రీకి సహజంగా అబ్బిన మనస్తత్వం! ఎవరూ కాదనటానికి వీల్లేని హక్కు!

"కృష్ణమోహన్ మీరు సాయంకాలం ఓసారి రండి! రిజల్ట్ చెప్పేస్తాను." డాక్టర్ మాటలతో ఆలోచనల్లోంచిబయట

పడ్డాడు కృష్ణమోహన్.

"థాంక్యూ డాక్టర్!" అంటూ బయటికి నడుస్తూన్న శారదని అనుసరించాడు.

"ఛీ! పరీక్ష చేయడమంటే యిలా ఉంటుందని తెలిస్తే రానే పోదును...." అంది శారద ముఖం ఆదోలా పెడుతూ..

o o o o

సాయంత్రం ఆస్పత్రి నుండి కృష్ణమోహన్ వచ్చిన తీరునే ఫలితం ఏమిటో గ్రహించింది శారద.

"పుణ్యంకొద్దీ పురుషుడూ దానం కొద్దీ పిల్లలు-అన్నారు యోగం లేదు ఇక యీ జన్మకింతే!" నిరాశగా అంటూన్న శారదనిచూస్తే గుండె తరుక్కుపోయింది కృష్ణమోహన్‌కి.

"అలా అనకు శారూ! పిల్లలులేనంత మాత్రాన అలా క్రుంగిపోవటంలో అర్థం లేదు. ఎప్పుడు అదే ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు కావాలంటే ఎన్నో వ్యాపకాలున్నాయి వీలయినంత వరకూ ఆ ఆలోచనకి దూరంగా వుండటానికి ప్రయత్నించు" తన మామూలు ధోరణిలో ఓదార్చాడు.

రోజులు భారంగా గడుస్తున్నాయి. శారద మానసికంగానే కాక శారీరకంగా కూడా నీరసించి పోతూంది అహరహమూ ఒకే ఆలోచన!

ఓరోజు కృష్ణమోహన్ బ్యాంక్‌కి వెళ్ళబోతూంటగా తల దువ్వుతూ—

"ఓ మాట చెబితే కోపగించుకోరు కదూ!" అంది శారద,

"ఊ"

"ఊం అంటే కాదు. మనస్పూర్తిగా చెబుతున్నాను. మీరు యింకో పెళ్ళి చేసుకోండి" కళ్ళల్లోంచి నీళ్ళుదూకాలా వద్దా అన్నట్టున్నాయి

చప్పున శారదని పక్కకి తోసేసి చెప్పులు వేసుకుని వేగంగా వెళ్ళిపోయాడు కృష్ణమోహన్

ఉవుక్కుమంది శారద హృదయం!

ఎంత చెప్పినా వినిపించుకోడేం యీయన?

పిల్లలంటే తనకెంత ఆరాటం!

అతనికి మాత్రం లేదా! మ ందుకు పట్టించుకోడు? తనకన్న పిల్లలు కాకున్న కనీసం తన భర్త ద్వారా మరో స్త్రీకి కలిగిన పిల్లలయినా సరే ఎత్తుకుని ముద్దాడి సంతోషపడి పోవాలని తనమనసెంత ఆరాట పడతుందో అతనికేం తెల్సు? ఎంత ఆశ పడతూందో ఎలా చెప్పగలదు?

ఎలా దారికి తేవాలి యీయన్ని!

రెండు రోజుల తర్వాత మళ్ళీ భర్తని కదిలించింది.

"నే చెప్పేది కాస్త నిదానంగా ఆలోచించండి. అత్తయ్యకు కూడా అదే అభిప్రాయమున్నట్టుంది మళ్ళీ పెళ్ళి చేసుకోరూ!" ఆశగా అతనికళ్ళలోకిచూసింది.

"మనకేం తక్కువయిందని యింత ఆరాటం పడుతున్నావ్ శారదా! నా మాట విను, ఒకరి నొకరం అర్థం చేసుకొని హాయిగా కాలం వెళ్ళబుచ్చుదాం! ఎందుకిలాంటి ఆలోచనల్తో బాధపడి నన్ను బాధపెడ్తావ్!" చికాగ్గా అన్నాడు కృష్ణమోహన్.

"హూం! ఎంతచెప్పినా మీ మాటేమీది. రెండో పెళ్ళి చేసుకొన్న వాళ్ళెంత మంది లేరు? మీకేంతక్కువని? మనంతిని మరో

నలుగురికి పెట్టగలిగి నంత ఆదాయం వుంది ఇల్లు పిల్లాపాపా లేకుండా బోసిగా వుంటే వెలితిగా లేదూ?' ఆవేదన కొట్టొచ్చినట్టు కనిపిస్తూంది. మనసు కరగించేలా వున్నాయి ఆమె మాటలు

శారద ఎంత చెప్పినా కృష్ణమోహన్ మనసు మారలేదు.

మామూలుగా బ్యాంకుకి పోతూవస్తూ వున్నా అదోలా దిగులుగా వుంటున్నాడు.

o o o o

నెల మధ్యకావటంతో ఆరోజ ఓచర్స్ తక్కువగా వున్నాయి. తీరిగ్గా సంతకాలు పెడుతూ కూర్చున్నాడు కృష్ణమోహన్.

"కృష్ణమోహన్ మీరే ననుకుంటాను. నా పేరు నరసింహం. మాది కర్నూలు" ఈ మాటలు విని తలెత్తి చూశాడు కృష్ణమోహన్.

"కూర్చోండి! ఏంకావాలి" అన్నాడు

"మా అమ్మాయి జ్యోతి! బియ్యే చదివింది'' జేబులో నుండి ఓ పాస్‌పోర్టు సైజు ఫోటో తీసి చూపాడాయన "ఇరవై మూడో సంవత్సరం నడుస్తూంది. నాకు యీమధ్య ఒంట్లో బాగుండటంలేదు ఈ సంవత్సరం పెళ్ళిచేసేయాలనుకుంటున్నాను."

"మా బ్యాంకులో బాచిలర్స్ ఎవరూ లేరండి! మీకు ఇన్‌ఫర్‌మేషన్ ఎవరిచ్చారోగాని!" అన్నాడు కృష్ణమోహన్ తిరిగి పనిలోకి తలదూరుస్తూ.

"నేను మిమ్మల్ని గురించే విన్నాను కృష్ణమోహన్ మీరేకదా!" అన్నాడు నరసింహం. ''మీ భార్య మిమ్మల్ని మళ్ళీ పెళ్ళి చేసుకొమ్మని కోరిందని "

చప్పున లేచి నిలుచున్నాడు కృష్ణమోహన్.

"ఇలారండి!" అంటూ బయటికి దారితీశాడు.

బయట లాన్‌లో నిలబడి "చూడండి బాబాయిగారూ! మా ఆవిడ పిల్లలులేరనే బాధతో ఏదో చెబుతుంది నాకసలు అలాంటి ఉద్దేశ్యంలేదు మీ అమ్మాయికి లక్షణంగా మరో సంబంధం చూసుకోండి! ఈలోగా నాకెవరయినా తటస్థ పడితే మీకు తప్పకుండా తెలియజేస్తాను. వెళ్ళిరండి!" బయటి గేటువరకూ అతనితో నడచి సాగనంపాడు.

పదిహేను రోజుల్నుంచి తనఎదురుగా ఈ విషయం ఎత్తకుండా వుంటే మరచిపోయిందనుకున్నాడు. అయితే శారద మనస్సులో ఇంకా సంతానంమీది ఆలోచన తొలగిపోలేదన్నమాట!

తిరిగి వచ్చి సీటులో కూర్చున్నా అతని మనస్సు పనిపై నిలవడంలేదు.

శారదకెలా నచ్చజెప్పాలి!

పిల్లలకోసం భర్తని రెండో పెళ్ళికి ప్రోత్సహించటం ఎంత చిత్రం! ఈ సమస్యని ఎలా ఎదుర్కోవటం!

మరో వారం గడిచింది

సాయంకాలం యింటికి పోయేముందు అలవాటుగా లెటర్‌బాక్స్ వైపు చూచాడు తన అడ్రసుకో కవరు!

తీసికొని చించి చదవసాగాడు నెల్లూరు నుంచి-

"బావా!

తెలిసో తెలియకో చేజేతులా పోగొట్టుకున్న భాగ్యం తిరిగి దక్కబోతూందంటే సంతోషించని వారెవరుంటారు? జీవిత సహచరిగా నీ ఆహ్వానాన్ని తిరస్కరించి




నందుకు నేను చింతించని రోజంటూ లేదు తీరా యిన్నాళ్ళకి భాగ్య దేవత అక్కయ్య శారద రూపంలో మళ్ళీ ఆహ్వానిస్తూంది ఆమె వ్రాసిన ఉత్తరం అందింది.

నీ హృదయ నందనోద్యాన వనంలో మయూరినై విహరించే అవకాశం కలగబోతున్నందుకు నా హృదయం గంతులేస్తూంది. ఇంతకు ముందులా అవివేకంగా ప్రవర్తించి అవకాశాన్ని విడిచి పెట్టుకోలేను.

నీతో వివాహం నా మనస్ఫూర్తిగా యిష్టమే మీ నుండి ఉత్తరం అందగానే వెంటనే నేను మీ ఊళ్ళో వున్న మా ఆఫీసు బ్రాంచికి ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటా–

మీ ఉత్తరం కోసం ఎదురుచూచే,

మీ 'ప్రియ'

శ్రీప్రియ.

షాక్ తిన్నట్లయింది కృష్ణమోహన్‌కి.

ఏమిటీ ఉత్తరం! ఎప్పుడో శ్రీప్రియని చేసుకోవాలనుకోవటం నిజమే మంచికో చెడుకో తప్పిపోయింది మళ్ళీ యిప్పుడు రెండో పెళ్లాంగా రావటానికి ప్రియ సిద్ధపడుతూందా?

శారద తనకి రెండో పెళ్ళి చేయటానికి ఎంత తీవ్రంగా ప్రయత్నిస్తుందో అర్థమయింది కృష్ణమోహన్‌కి,

ఇక లాభం లేదు! కాఠిన్యం చూపకపోతే కుదిరేట్టు లేదు. ఇలా అయితే నలుగురిలో నవ్వుల పాలు కావల్సి వస్తుంది.

ఇంటికి వెళుతూ దారిలోనే టెలిగ్రాం యిచ్చాడు శ్రీప్రియకి–"నో మారేజ్ ప్రపోజల్స్ ప్లీజ్!"

నన్నగా తలనొప్పి ప్రారంభమైంది. ఆలోచనల్తో ఆవేదనతో మెదడు వేడెక్కిపోతూంది.

శారద యిలాగే ఆలోచిస్తూ ఏమయిపోతుందో? ఈవిచ్చి ఎలా మాన్పటం!

## నగరంపై పీడనీడ

వల్లాస్ పూజావేదికలవద్ద
ఇస్మెనస్ నదీతీరాల జ్వలించే
పవిత్రాగ్నిహోత్రాల వద్ద
బజారులమ్మట రాజప్రాసాదాలవద్ద
చేరిన యీ జనసందోహాన్ని
చూడు ప్రభూ
చిదిమితే పాల్గారే చిన్నారి బుగ్గలు
ముక్కుతూ మూల్గుతూ ఉండే ముసళ్ళు
మోహన యౌవన వనమాలు
తరుణవయస్కులు
వీరందరినీ కనికరించి అవధరించు
ప్రభూ
ఈ నగరంపై ఏదో నల్లని పీడనీడ
పడింది
మృత్యువు తన భయంకర పాశాన్ని
విసిరింది
సౌభాగ్యవతి ధాత్రి యిది
మన వంశపిత కాడ్మస్ గృహలక్ష్మి..

(అసంపూర్ణం)
('కళాకేళి పత్రికలోంచి-
సేకరణ : ఏ. సూర్యప్రకాశ్)

కీ॥ శే॥ దేవరకొండ
బాలగంగాధర తిలక్

చదువుకున్న ఆడవాళ్ళకి కూడా యీ సెంటిమెంట్స్ ఏమిటి?

బ్రతికినన్నిరోజులు హాయిగాజల్సాగా గడపక ఎందుకొచ్చిన ఆలోచనలు అవి?

శ్రీప్రియకు మాత్రం బుద్ధి ఉండక్కర్లేదా? ఒకసారి పెళ్ళయినవాడితో పెళ్ళికి సిద్ధమేనంటూ ఎందుకు వ్రాసింది?

ఇంటికి చేరుకున్నాడు.

రోజుకంటే ఉత్సాహంగా ఎదురొచ్చింది శారద! లుంగీ అందించి షర్టు తీసుకువెళ్ళి స్టాండుకు తగిలించివచ్చింది

ముఖం కడుక్కొని ఈజీ ఛయిర్‌లో వ్రాలాడు కృష్ణమోహన్.

కప్పుతో వేడి వేడి కాఫీ అందించి ఎదురుగా కుర్చీలో కూర్చుంది శారద.

"శ్రీప్రియనుంచి ఉత్తరమొచ్చింది" ఎంతో సంతోషంతో తనపేర వచ్చిన కవర్ అందించింది.

"చూడనక్కర్లేదు. టెలిగ్రామ్ కూడా ఇచ్చేశాను" అన్నాడు కష్ణమోహన్ నిరాసక్తంగా కాఫీ త్రాగసాగాడు

"టెలిగ్రామ్ ఇచ్చారా? ప్రియని ఎప్పుడురమ్మన్నారు! ఇక్కడికే ట్రాన్స్ ఫర్ చేయించుకొమ్మని రాశారా?" ఆత్రంగా ఆసక్తిగా అడిగింది

కాఫీ కప్పు టీపాయ్ మీదుంచాడ. కృష్ణమోహన్.

"నీకు పిచ్చిపట్టిందా ఏమిటి?ఎందుకు నన్నిలా బాధిస్తావ్? నాకు రెండో పెళ్ళి చేస్తావా? నీకులాగే శ్రీప్రియకి కూడా బుద్ధిలేకున్నట్టున్నది. మరోసారి యిలా ప్రయత్నించావంటే బాగుండదు " కఠినంగా అన్నాడు కృష్ణమోహన్.

ఉద్వేగంతో అతని ఛాతీ ఎగిరి పడతోంది.

శారద ఉత్సాహం నీరుకారిపోయింది.

అనుకోన్ని పరిణామానికి బిత్తరపోయింది. అయినా తమాయించుకుంది.

## జవజీవాలొలికే పళ్ళిక మీవి!

**బినాకా ఫ్లోరైడ్‌తో పళ్ళను జీవితాంతం సంరక్షించుకోండి.**

బినాకా ఫ్లోరైడ్‌లో, అత్యంత ప్రభావం గల ఫ్లోరైడ్ కాంపౌండ్ ఉంది. అది పళ్ళయొక్క ఎనామెల్‌తో కలిసి, మీ పళ్ళను మరింత గట్టిగా చేస్తుంది.

జీవితాంతం, పళ్ళు పిప్పి పళ్ళు కాకుండా నిరోధించడానికి యీ సంరక్షణ అవసరం. ఎప్పుడూ బినాకా ఫ్లోరైడ్‌తో బ్రష్ చెయ్యండి. దీన్ని మీరెంత ఎక్కువ కాలం వాడితే, అంత ఎక్కువ కాలం మీ పళ్ళు జవజీవాలతో ఉంటాయి.




గట్టి పళ్ళకోసం, పిప్పి పళ్ళు రాకుండా నిరోధించడంకోసం.

# బినాకా ఫ్లోరైడ్

అగ్రశ్రేణికి చెందిన భారతదేశపు, ప్రభావంగల మొట్టమొదటి ఫ్లోరైడ్ టూత్‌పేస్ట్

ULKA-BF-1-81-

"పోనీ శ్రీ ప్రియ ఇష్టంలేకపోతే పోయింది. శేషు కడప రామమూర్తిగారు అమ్మాయిని పిలుచుకుని వస్తామన్నారు అమ్మాయి చాలా బాగుంటుందట..." చెప్పబోయింది శారద

"నోర్ముయ్! మొగుడికి పెళ్ళిచేసే ఆరిందావు తయారయ్యావ్! ఎంతకైనా తెగించేవున్నావు! ఇక మాట్లాడావంటే" ఊగిపోతూ అన్నాడు కృష్ణమోహన్.

"ఏం? అంత కాని పని ఏం చేస్తున్నాను? నీతి బాహ్యంగా ప్రవర్తిస్తున్నానా? చట్ట విరుద్ధంగా చేయబోతున్నానా? నాకు లేని అదృష్టాన్ని యింకో రూపంలో అందుకోవటం తప్పా? మాతృత్వం పొందేభాగ్యం నాకెలగూ లేదు. మీదార్వా మీప్రతి రూపాన్ని మరో స్త్రీనుండి పొందా కోవడం నేరమా?

ఈసమస్యకి పరిష్కారం వేరేవిధంగా ఏం చెబుతారో చెప్పండి!

... కావాలనీ ఏస్త్రీ కూడా భర్తని మరో స్త్రీతో పంచుకోదు. నేను అందుకు కూడా సిద్ధపడ్డాను. నా బాధ అమాత్రం అర్థం చేసుకోలేరా?" ఒక్కొక్క మాట ఒక్కో బల్లెంలా తాకుతూంది. ఆమె మనసులోని కోరిక తీక్షణత ఆ మాటల్లో ప్రతిబింబిస్తూంది

జవాబివ్వ లేక పోయాడు కృష్ణమోహన్.

అతని ముఖంలో యింతకు ముందున్న కోపం ఉద్వేగం లేవు అస్థానంలో జాలీ, దీనత సానుభూతి చోటు చేసుకున్నాయి

భార్య మనస్థితి అర్థం అయ్యిందిలా వుంది.

దగ్గరగా వచ్చి శారద చేతులు పట్టుకున్నాడు.

"అర్థమయింది శారదా! కానీ..కానీ" అతని గొంతుక బొంగురుగా వుంది. బాధతో పెగలని కంఠంలా వుంది

అస్థితి చూసి శారదకి కూడా కళ్లలో నీళ్లు తిరిగాయి. తుడుచుకుని ఏమిటన్నట్టుగా అతని వైపు చూసింది

"ఇక యీ నిజాన్ని నీనుండి దాచుకోవటం సాధ్యం కాదు శారదా! చెప్పేస్తాను. దయచేసి ఏమీ అనకోవు కదూ!...

ఆరోజు. నిన్ను ఆస్పత్రికి తీసికెళ్ళిన రోజు. రిజల్టు తెలుసుకోవడానికి సాయంత్రం రమ్మని డాక్టరు చెప్పింది గుర్తుందికదు! వెళ్ళాను... నీటెస్ట్ రిజల్టు నెగటివ్ అని తెలిసింది బాధతో వెళ్ళబోతూంటే నన్నుకూడా టెస్ట్ చేయించుకోమంది డాక్టర్!

ఏదోఆశ! ఇప్పుడు నీలో రగుల్తూన్న ఆలోచన ఆనాడే నాలో కలిగింది.

టెస్ట్ చేయించుకున్నాను. .ఏంచెప్పేది సుఖానికి మాత్రమే మనం అర్హులం శారదా! సంతాన ప్రాప్తికి యిద్దరమూ అనర్హులమే యీ వేదునిజాన్నియిన్నాళ్ళూ నాలోనే దాచుకున్నాను. ఇక భరించలేను మగవాడిననే అహం యిన్నాళ్ళూ నాతో నిజం చెప్పించలేక పోయింది. నన్ను తీరని వ్యధకు గురి చేసింది ... శారదా! నన్ను క్షమించవూ!"

అతని కన్నీటి బొట్లు ఆమె చేతుల మీద రాలాయి



సీరియల్

# సౌభాగ్యలత

ఆరెకపూడి (కోడూరు) కౌసల్యాదేవి రామశాస్త్రి

---

(జరిగినకథ)

(పనులని పంపించిన శశికి అత్తగారి ఆంక్షలు తీపి బాధించాయి. తాప శమనం మహేష్ సించి ఆశించి దక్కలేదు. పై ఆఫీసరు భార్య మరో శ్రీమంతుల జంటతో శ్రీమంత్ బలరామ్ తంమీద శశి షాపింగ్‌కి బయలుదేరింది. వేలు పిలుపుచేసే నగలు, బట్టలు, హోటల్ ఖర్చు-అంతా మహేష్ పెట్టాడు-గాలానికి ఎరలా. అందర్నీ ఇంటికి పంపి ఒంటరిగా మిగిలిన శశిదగ్గరికి తప్పతాగి వచ్చాడు)

- ఇక చదవండి -

మహేష్ మరలా బాగా తాగాడన్నమాట!

ఎక్కడ?

సునీతతోనా?

రాత్రంతా ఆమెదగ్గరే వున్నాడా?

ప్రశ్నలు! భయంకరమైన ప్రశ్నలు పెదపడగా పాముపిల్లల్లా తొంగిచూస్తూ కాటం వేస్తున్నాయి.

మధ్యాహ్నం ఒంటిగంట కొడుతుండగా లేచాడు మహేష్ బద్ధకంగా. ఎదుట సోఫాలో కదలక మెదలక ప్రతిమలాగ కూర్చున్న శశిని చూసి కళ్లు చికిలించాడు.

"అరె! నువ్వింకా శివరాం ఇంటికి వెళ్ళలేదూ?"

శశిరేఖ కదలలేదు, మాట్లాడలేదు; అతడినే పరీక్షగా చూస్తోంది.

మహేష్ హెచ్చుస్వరంతో రెట్టించాడు

"ముందిది చెప్పు? నీవు రాత్రంతా ఎక్కడున్నావు?"

దానికి ఎదురు సవాలు మహేష్ బద్ధకాన్నంతా వదిలించేసి, లేచి కూర్చుండేట్లు

చేసింగి.

"తొంద మునిరి........అన్నట్టుందే?"

"నేను తొందనా?" శశి తగ్గని కోపంతో అడిగింది

"వేరే అడగాలా? నన్నింత నిర్భయంగా నిలబెట్టి ప్రశ్నలు వేస్తున్నావంటే ఏమనాలి? మగవాడికి లక్ష పనులుంటాయి"

"భార్య వినకూడని పనులా?"

"అర్థం చేసుకోలేని అయోమయానికి ఏం చెప్పి ఏం లాభం?"

"ఫర్వాలేదు చెప్పు. అర్థం చేసుకుంటాను. కుమార్ భార్యను నీకు ఒప్పజెప్పి రాత్రి ఆఫీసు వుందంటూ వెళ్ళిన ఘనుడు! నువ్వు రాత్రంతా అతడి భార్యకు కంపెనీ యిచ్చిన మొనగాడవు! మధ్యన నేను అయోమయాన్నా? సిగ్గులేదా ఆమాట అనడానికి?"

లేచి సిగరెట్ ముట్టించి అటూ యిటూ పచార్లు ప్రారంభించాడు మహేష్

"శశీ! నీ పాతకాలపు మాటలూ, ఊహలూ మానిపోవాలి ఒక్క మాటలో- నీవు శశిరేఖవనే మర్చిపో. నీవు ఇప్పుడు హైసొసైటి మహేష్ భార్యవు! హైసొసైటి సంగతులు అర్థంచేసుకో. ఓ మామూలు ఉద్యోగి భార్యలా మాట్లాడకు."

"హైసొసైటీ వాళ్ళు పగలు నిద్రపోయి రాత్రుళ్ళు గైర్‌హాజర్ అవుతారా? తన భార్యెవరో పరాయిదెవరో తెలియకుండా ప్రమదంగా తిరుగుతారా?"

"కరెక్ట్, నిజానికి దగ్గరగా వస్తున్నావు అభివృద్ధికరమైన పనులుచేసే మా వంటి అభ్యుదయ వాదులకు నీవంటి అవివేకులు అనేకులు అర్థంచేసుకోలేక అడ్డు నిలుస్తారు; గునగునలాడుకుంటారు అందుచేత మా అభ్యుదయ కార్యక్రమం అంతా రాత్రుళ్ళే రహస్యంగా సాగుతుంది."

"అంటే?"

బిగ్గరగా నవ్వాడు మహేష్.

"సునీతను ఇంటిదగ్గర దింపాక నేను ఆఫీసుకు వెళ్ళాను హెడ్‌క్లర్కును కూడా నోట్లకట్టలతో తృప్తిపరచాను. తర్వాత క్రొత్త కాంట్రాక్టు నిమిత్తంవచ్చిన టెండర్లన్నీ రహస్యంగా అర్థరాత్రి ఓపెన్‌చేశాం"

"అన్నీ సీల్డ్ టెండర్స్‌కదా? ఎలా ఓపెన్‌చేస్తారు?"

తిరస్కారంగా నవ్వాడు మహేష్.

"బొమ్మిని తిమ్మి తిమ్మిని బొమ్మి చేయగల మహత్తులు ఉంటాయిలే. ఓర్పు ఉంటే అవన్నీ నెమ్మదిగా నేర్చుకోగలవు మరి! జాగ్రత్తగా ఓపెన్ చేస్తాం సీళ్ళు సీళ్ళలాగే ఉంటాయి. అందుకే ఆ హెడ్ క్లర్కుగాడిని కూడా అంతో ఇంతో ధన వంతుడిని చేయడం....ఆ తర్వాత ఆ అన్నిటికంటే కాస్త తక్కువ కొటేషన్‌తో నా టెండర్ వాటిలో ఇరికించాను! వారంరోజుల ముందే టెండర్స్ పంపి ఎదురు చూస్తూ కూర్చున్న అందరి పని గోవిందా! రేపు నాకే ఆ వర్క్ దొరుకుతుంది అది




ముప్పయిలక్షల కాంట్రాక్టు!"

"ఆఁ!" శశిరేఖ కన రెప్పలు కదలికను మరువగా చూస్తూండిపోయింది.

మహేష్ గర్వంగా భుజాలెగుర వేశాడు.

"ముప్పైలక్షల్లో మన పెట్టుబడి ముప్పై రూపాయలు కూడా వుండదు!"

శశిరేఖ భృకుటిముడితో చూచింది అర్థంకానట్టు

మహేష్ గర్వం అతిశయించగా ఆమెకు దగ్గరగావచ్చి చేతులతో చుట్టివేస్తూ "అర్థంకాలేదా డియర్?" అన్నాడు చెవిలో.

"ఉహుఁ, నాకేం తెలియడంలేదు" అన్నది శశి

జ్ఞానమూర్తి అజ్ఞానిని చూసినట్లు చూచి జాలిగా నవ్వాడు మహేష్.

"అందుకే మరి ఎంత నేర్చినా ఎంత జూచినా మిమ్మల్ని 'ఆడవాళ్లు'అన్నారు! నేను చెప్పేది విని జాగ్రత్తగా నీమనసులోనే భద్రపరచుకో." ఈ రహస్యం ఆ రవి చంద్రాదులకూ బ్రహ్మరుద్రులకూ కూడా తెలియరాదు!"

"సరే, చెప్పు మహేష్".

చేతులలోని శశిరేఖను వదలి చేతులు వెనుకకు కట్టుకొని పచార్లుసాగించాడు మహేష్ కొంత తడవు.

హఠాత్తుగా ఆగి భార్యను అడిగాడు!

"నేనెవర్ని? కంట్రాక్టర్ని! ఔనా?"

''ఊఁ''

అలనాడు కురుక్షేత్రంలో పార్థునికి గీతోపదేశం చేస్తూన్న శ్రీకృష్ణుని లాగా విషయ వివరణ ప్రారంభించాడు.

"కంట్రాక్టర్ అనేవాడు తన డబ్బూ-పెట్టుబడీ అనేది మరిచిపోతేనే కేవలం ఆ వృత్తిలో నిలబడ గల్గుతాడు; ఈ సూక్ష్మం గ్రహించినవాడు కట్టుగుడ్డలతో వచ్చినా కోట్లకు పడగలెత్తుతాడు! లేదూ-ఇంట్లో నగానట్రా, డబ్బూ దస్కమూ ఆ పనులలో పెట్టుబడిగా పెడుతూ కంట్రాక్టులు చేయాలనుకొనేవాడు కోటీశ్వరుడైనా నెత్తిన కొంగేసుకు పోతాడు! ఇదీ కంట్రాక్టరోపాఖ్యానం!" అంటూ నవ్వేశాడు మహేష్.

శశి నవ్వలేదు.

"మరి పెట్టుబడి అప్పులుగా తెస్తావా?" అనడిగింది.

"ఛఛఛ, అప్పా? అది మన చుట్టుపక్కలకు రారాదు. అప్పుతెస్తే తిరిగి వడ్డీలతో సహా జమకట్టవద్దూ?"

"ఔను. కట్టాలి!"

"ఆఁ! అటువంటి అలవాట్లు మాకు లేవుగామరి?''

"అబ్బ! నాకర్థం కావటం లేదు మహేష్!"

"అర్థాంగీ! నీకు అర్థం కానివన్నీ అర్థం కావించే పతిని నేనున్నాను కదా? అప్పులకు ఒక జబ్బువుంది— అవి తెచ్చాక తీరడమంటూ వుండకపోగా నేటి జనాభాలాగ నిరవధికంగా పెరిగి పోయి. అప్పు తెచ్చిన వాడిని అణచి వేసి బికారిని చేస్తాయి. ఇచ్చిన వాడి ధనపు రాసులను మందులేని కేన్సర్ లాగా వృద్ధి చేస్తాయి. అంచేత ఇప్పట్లో నాకు అప్పుల ప్రకరణం వద్దు. తెలివైన వాడు అప్పు ఎప్పుడు చేస్తాడూ అంటే—శుభ్రంగా నిర్లజ్జగా ఐపీ పెట్టాలనుకున్నపుడు! అప్పు యిచ్చిన వాడే నాశనమౌతాడు. మాపూర్వులు ఒకరిద్దరు ఆ ఘనకార్యం చేశారనే రాజభూషణంగారు ఇంతటి జమీందారీ ఫాయిలో వున్నారు!''

శశిరేఖ మాటలు మరచి విస్మయంగా చూడ సాగింది.

"అప్పులు ఎవరికిస్తారు శశీ? బాగా ధనవంతులకూ, బాగా సంపాదించే వాళ్ళకూ ఎవడైనా సరే కళ్ళు మూసుకుని యిస్తాడు. మరినేను ఆ స్థాయికి ఎదగాలి, కంట్రాక్టు మీద కంట్రాక్టు చేయాలి, తండ్రిచాటు కొడుకుగా గాక ఒక వ్యక్తిగా-ప్రయోజకుడిగా నిలబడాలని. అప్పుడు వద్దన్నా తెచ్చి అందరూ తమడబ్బు నాకాళ్ళ మీద పారేస్తారు. అప్పుడు జాగ్రత్తగా నాసంపాదనా ఆస్తిపాస్తులూ అన్నీ నీపేరా, మనకు పుట్టిన అదృష్టవంతుల పేరనూ వ్రాసేసి, నేను అప్పులవాళ్ళకు ఖాళీ చేతులు చూపుతాను. ఇదీ ఐపీ రహస్య గ్రంధం!"

అంతవరకూ అస్థిత్వాన్నే మరచి వింటూన్న శశిరేఖ గొంతు పొడారి పోతూండగా సన్నని స్వరంతో అడిగింది.




"అవి.......చాలా అప్రతిష్ఠ కదూ?

వికటంగా నవ్వాడు మహేష్!

"ఔను. న్యాయస్థానపు పరిభాషలో అయిపీ పెట్టినవాడు మృతుడితో జమ! విలువలేదు. కానీ ప్రయివేట్ భాషలో మాత్రం అతడికంటే ఘనుడులేడు! సలహా కైనా జనం చీమలలాగా వాడిదగ్గరకే చేరతారు. గుళ్ళో దేవుడిని మించి పూజించుతారు. ఎవళ్ళో తెలివితక్కువవాళ్ళు మాత్రం వాడిది అక్రమ సంపాదన అని అలసిపోయినా లెక్కలేదు! "ఇది అయిపీ గ్రంథ తాత్పర్యం!''

శశిరేఖ మాటలుడిగి, చేష్టలుడిగి చూడసాగింది.

"ఏమిటోయ్ అలా చూస్తావ్ ఇంత చెప్పినా?"

దగ్గరగావచ్చి భుజాలు పట్టి కుదుపుతూ అడిగాడు.

"ఇవన్నీ చెప్పావుకానీ ఇంతకూ నువ్వు ఇంద్రటాక్టులకు పెట్టుబడిగా ఏడబ్బు ఉపయోగిస్తావనేది చెప్పలేదు మరి!''

"అబ్బ! గట్టిదానవే. ఇంకా ఆ విషయం మరువలేదు ఇన్ని చెప్పినా!"

"చెప్పుమహేష్." అతడి ఎదపై తలఆన్చి గోముగా అడిగింది శశిరేఖ.

"మరి రహస్యం ఎవ్వరికీ చెప్పవుగా?"

"నాపైన నమ్మకం లేదా మహేష్?"

"ఉన్నదోయ్ లేకుంటే యింత వరకూ మాత్రం మా ధనార్జనా కీలకాలు ఎందుకు చెప్తాను!"

"చెప్పు మరి''

''కుమార్, శివరాం కాకయింకా నలుగురు వ్యక్తులు వ్నారు మ రే వో వో నంస్థలలో పని జేసే వాళ్ళు-నాకు ముఖ్యస్నేహితులు అవనరమైన పెట్టుబడి అంతా నాకంట్రాక్టులకు వాళ్ళే పెడతారు"

''వాళ్ళంత ధనవంతులా?"

బిగ్గరగా నవ్వాడు మహేష్.

"కుమార్ వారాలు చేసుకు చదివే వాడు. శివరాంకు ఎన్నోసార్లు మాపెద నాన్నగారు వాళ్ళ అవసరాలు ఆదుకునేవారు, మాపెద్దనాన్న దగ్గర గుమాస్తాకొడుకు శివరాం, అయితే ఈ వివరాలు వాళ్ళ భార్యలకే తెలియవనకో"

"ఏదో ఏడవనీయ్ మరి అంత బీదవాళ్లు నీకు యింత డబ్బెక్కడ నుండి యివ్వగలరు? ప్రస్తుతం నెల జీతాలేగా వాళ్ళకు ఆధారం!"

"కాదు! అపోజిషన్స్‌వో వుండి వాళ్లు సంపాదించుతున్న నల్ల ధనమంతా వాళ్ళేటూ పబ్లిగ్గా ఉపయోగించుకోలేరు. అంచేత ఆటువంటి వాళ్లు నావంటి వాళ్ళను ఉపయోగించుకుంటారు!"

విన్నది ఆకళింపు కాని శశిరేఖ అలాగే అర్థం కానట్టు చూస్తోంది.

"ఏమిటలా చూస్తావ్? వాళ్లు నావంటి కంట్రాక్టర్లకు బిల్లులు పాస్‌చేయాలంటే డబ్బు; అసలు మొదట ఆ కంట్రక్టు ఇవ్వడానికే లంచం; ఆపైన అంచెలం చెలగా పని జరుగుతూ పార్టు పేమెంట్సు జరుగుతూంటాయి; ఒక్కో బిల్లు పానవ్వ డానికి ముందుగానే వాళ్ళను తృప్తిపరచాలి కోరినవి అర్పించి ఒకడికి ఉద్యోగం యివ్వాలంటే లంచం, మరొకడికి ఏదైనా రికమెండేషన్ చేయాలంటే లంచం, ఇలా ఎంత సంపాదన మూల్గుతుందో వాళ్ళదగ్గర తెలుసా నీకు?''

"మరి అదే ఉపయోగించుకొనే వీలు లేనప్పుడు దానిని ఈ కంట్రాక్టుల్లోపోసి ఇంకా వృద్ధిచేసి ఉపయోగమేమిటి? ఎక్కడ దాస్తారు?"

"మంచిప్రశ్నే వాళ్ళుదాచుకోరు. ఆ డబ్బంతా నావంటివాడి చేతుల్లోనే తిరుగుతూంటుంది రేపు వాళ్ళ పిల్లలకు పెద్దచదువులు చెప్పిస్తారు నామకార్థం ఏవో స్కాలర్ షిప్స్ వుంటాయి. దర్జాగా అవనరాలన్నీ ఈ డబ్బు తీరుస్తుంది. కూతుళ్ళకు తలకు తగని సంబంధాలు చేస్తారు. పిల్ల అందంచూచి మురిసి ముక్కలై కట్నం అడగలేదని చెప్తారు. కానీ లక్షలు లక్షలు మూటలు ముందే వియ్యాలవారింటికి చేరు తాయి. ఈ డబ్బే పిల్లలను విదేశాలకు కూడా పంపుతుంది. ఇలా వాళ్ళ డబ్బును వృద్ధిచేస్తూ దానికి కావలదారుగా వుంటూ, నేనూ నా లాభాలు తీసుకుంటాను. ఇది పరస్పర అవగాహనతో కూడుకున్న విషయం!"

వినిన విషయాలన్నీ సాధారణమైనవేమీ కావు; దిగ్భ్రాంతురాలే అయ్యింది శశిరేఖ.

"ఆడుతూ పాడుతూ బేఫర్వాగా కన్పించే నీవు ఎంత చతురుడవు! మరెంత తెలివైన వాడవు మహేష్! నేను ఊహించనైనా లేదు."




మహేష్ గర్వాన్ని పైకి ప్రదర్శించ లేదు.

"చెప్పానుగా మీ ఆడవాళ్లకు అలుకలు సాగించడం, అలంకారాలు చేసుకోవడమే కానీ అసలు జ్ఞానం లోపమేనని! ఇంత జాగ్రత్తగా పథకాలు వేస్తేనే బికారులు కోటీశ్వరులయ్యేది. లేకుంటే మీ నాన్నగారిలాగా ఓ పెళ్ళికే నిలవనీడ లేకుండా పోవాలి!''

"మరి ఈరోజు పెళ్ళికి కొన్న నగలూ వగైరా డబ్బు నీవే యిచ్చావుగా?''

"ఔను అదే గాదే! ఇంకో రాబోయే కంట్రాక్టు నిమిత్తం అడ్వాన్సుగా కొంత ముడుపు చెల్లించానన్న మాట! వాళ్ళకు కావాల్సిన అలాంటి పెద్ద పెద్ద వస్తువులన్నీ మాబోటి వాళ్ళ ద్వారానే లభిస్తాయి దేనికీ బిల్లులు వుండవు కొన్న వస్తువులకు."

నాగస్వరానికి మైమరచి ఆడుతూన్న నాగినే అయ్యింది శశిరేఖ. భర్త చెప్పే ప్రతివిషయం అద్భుతంగా కనిపిస్తోంది. అతడు మహామేధావుడులా కన్పిస్తున్నాడు.

ఆమె కళ్ళలో మైకాన్ని గమనించిన మహేష్ అతి మృదువుగా మరొక మైమరపించే విషయాన్ని ప్రకటించాడు.

"ఇలాంటి కంట్రాక్టులు మరో మూడో నాలుగో వస్తే చాలు శశీ మనకు. ఈ మేడలో ఈ ఉమ్మడి కుటుంబంలో వుండనక్కరలేదు. విడిగా మన కోసం ఒక దేవేంద్ర భవనమే నిర్మించేస్తాను''

''నిజంగానా మహేష్?"

ఆనందాతిరేకంతో ఒక్కసారిగా అతడిని పెనవైచుకుపోయింది శశిరేఖ.

"ఔను. మరి మన పథకాలు సాగాలంటే నువ్వు నాకు అన్నివిధాలా సహకరించాలి శశీ. నువ్వు నా జీవితంలో అడుగుపెట్టావు నీ ప్రభావంతో నా రాబడిని

వృద్ధిచేయాలి. నన్నర్థంచేసుకొని నాతోపాటు అడుగులు వెయ్యాలేకానీ అడుగడుగునా నవాళ్ళతో విసిగించితే పనులు జరుగవు"

నహకరిస్తాను మహేష్! నన్ను నమ్ము. నా కోసం నువ్వు ఇంద్రభవనమే నిర్మిస్తానంటే నేనెంత అదృష్టవంతురాలిని!"

అపుడే ఆ భవనంలో విహరిస్తున్నంత తమకంతో భర్తకు మరింత చేరువై అతడి క్రాపును సవరించసాగింది.

మహేష్ అతిశయంగా అన్నాడు.

"ఇంద్రభవనమేం? ప్రేమనగరే కట్టేస్తాను మరి! నువ్వు అడుగడుగునా అడ్డు నవాళ్ళూ, కోపతాపాలూ అన్నీ వదలి నే చెప్పినట్లు నడచుకోవాలి"

"చెప్పు మహేష్." గోముగా, గారంగా అడిగింది.

"ఇవాళ నువ్వు-ఇప్పుడే-ఖరీదైన వేషంతోకాక ఓ మాదిరిగా తయారై కుమార్ ఇంటికి వెళ్ళు అక్కడ రోహిణీ, సునీతా ఇంకో ఇద్దరు ముగ్గురు స్త్రీలు కూడా వుంటే వుండొచ్చు. క్రొత్త పరిచయాలు-గెట్ టుగెదర్ లాంటిదన్నమాట. అంతే. క్రొత్త పెండ్లికూతురివి వాళ్ళు నాకు తెలిసినవాళ్ళు కనుక నిన్ను మర్యాదగా ప్రప్రథమంగా వాళ్ళింటికి భోజనానికి పిలిచి గౌరవించారన్నమాట! వెళ్తావా మరి?"

"ఓయస్!"

"ఏ పేకాటో కేరమ్సో ఆడుకోండి, లేదా హాయిగా కబుర్లు చెప్పుకోండి. ఇక్కడ అత్తగారూ, తోటి కోడండ్రూ నీతో మాట్లాడడం లేదూ-తోచడంలేదూ అనే చీకాకూ తప్పి నీకు సరదాగా గడిచిపోతుంది."

"హాయ్! తప్పక వెళ్తాను."

ఆనందంతో గుండ్రంగా తిరిగి, నాట్యం చేసింది శశి. ఆగుమరీ! మరలా నువ్వువచ్చేప్పుడు వాళ్లు ఏ చీరో సారో ఇస్తారు. తీసుకో."

"అలాగే"

"ఆఁ అక్కడే వుంది కీలకం. అందులో ఓ కాగితమో కవరో వుంటుంది. అది నువ్వు నాకు అతిజాగ్రత్తగా తెచ్చిఇవ్వాలి."

"ఏమిటది?" శశి వదనం మరలా మారిపోయింది. మహేష్ విసుగుదలగా అన్నాడు.

"అదిగో అప్పుడే మళ్ళా ఏడుపుముఖం వచ్చేసింది నీకు. అదేమీ ప్రేమలేఖ కానీ కాదు నా కోసం. ఆ ఆఫీసులో పెద్ద పెద్ద కాంట్రాక్టుకు టెండర్స్ పిలుస్తూన్న రోజులు గనుక నేనూ కుమార్ శివరాం కలసి అట్టే కన్పించకూడదు లోకానికి. శివరాం, కుమార్ నాకు చెప్పదలచుకున్న వివరాలన్నీ ఆ పనులకు సంబంధించినవి ఆ కాగితంలో వుంటాయి. అందుచేత చాలా జాగ్రత్త, మన కార్లో వెళ్ళి కారు పంపించేయి. మళ్ళా ఏ టాక్సీలోనో వచ్చేయి. మళ్ళా వాళ్ళెప్పుడు రమ్మంటారో విను.

'అలాగే. ఇదేం బ్రహ్మ విద్య కాదు."

"బహ్మ విద్యే. మామీద నిఘాలు వున్నా వుండచ్చు. జాగ్రత్తగా మసలు కోవాలి సరేనా?"

"ఓ. వెళ్ళాను యిప్పుడే తయారై"

"గుడ్ గాళ్!" ప్రశంసా పూర్వకంగా అంటూ దగ్గరకు తీసుకున్నాడు. "చూశావా మరి ఎంతెంత పథకాలో పని సాగించటానికి. ఎన్నో వేషాలు వేయాలి. నావంటి మగవాడికి బొత్తిగా మడిగట్టుక్కూర్చోవడానికి జరుగదు ఆ సునీతలాంటి వాళ్లకు కొందరికి నాలాంటి అందగాడి మీద మోజు వుంటుంది మరి. ఆమెభర్త-అదే కుమార్- ఎంతటి అనాకారుడో చూశావుగా?"

తృళ్ళిపడింది, అంతవరకూ అతడి ఒడిలో మైమరచి వున్న శశిరేఖ.

"ఆఁ ఆఁ." వారింపుగా అన్నాడు మహేష్.

"ఆ ముక్కు చివర కోపమే వద్దు. వట్టి ఎడవులు వుండాలి. కొన్నాళ్లు చూడు. నువ్వే అర్థం చేసుకుంటావు."

నేల చూపులు చూస్తూన్న శశి ఇంక మాట్లాడలేదు.

"పిచ్చి శశీ నిన్నేమైనా వాళ్ళలాగా వుండమన్నానా? లేదుగా? మన అవసరం మేరకు మాత్రమే వాళ్ళ పార్టీలూ వగైరాలకు వెళ్తావు. అంతే నీవైపు కన్నెత్తి చూచే సాహసం కూడా ఎవడికీ వుండదు. నువ్వు పౌరుషవంతుడైన మహేష్‌కు మహారాణివి! వాళ్ళేముంది- అవసరాలకు ఎంతకైనా దిగజారుతారు. అయినా నీ భర్తకు ఆమె గులాము అంటే నీకే గర్వంకాదూ? ఆ కారణంవల్లనే వాళ్లు మన అడుగులకు మడుగు లొత్తుతారు తెలుసా? ఏదీ నవ్వు. ఊఁ!"

నవ్వక ఏం చేస్తుంది-శశి కనుల ముందు ఇంద్ర లోకమూ, ప్రేమనగర్ మురిపించుతూ గిరికీలు తిరుగుతూంటే?

# 36

శ్రీమంత్ అతి సంతోషంగా వచ్చాడు.

"రైల్వేలో ఒక ఫ్రెండ్ కన్పించాడు. ఈరాత్రి ట్రెయిన్‌కు మనకు తప్పక టికెట్స్ రిజర్వ్ చేయిస్తానన్నాడు. అన్నీ సర్దేశావా వకుళా?"

"ఆఁ" అతడికోసం ఫలహారం సిద్ధం చేస్తున్న వకుళ మామూలుగా అన్నది.

కోటుతీసి హేంగర్‌కు తగిలించుతూ విస్మయంగా చూచిన శ్రీమంత్ మరు క్షణంలో ఒక్క అంగలో వచ్చి వకుళను చుట్టివేసి లేవదీస్తూ అన్నాడు.

"ఏమిటి వకుళా అంతా మంద కొడిగా వున్నావు? ఎంత సంతోషంగా చెప్పాలి సమాధానం? నేవచ్చేసరికి అప్సరసలా వుండాల్సింది ఈ వసులలో మునిగావేమిటి?"

అతడి వక్షస్థలంపై తల ఆన్చుకొన్న వకుళ మధురంగా నవ్వింది.

నేనున్నంత సంతోషంగా ఈనాడు ఎవ్వరూ లేరు శ్రీమంత్. ముల్లోకాలకూ నేనే విజేతనైనంత ఆనందంగా వున్నది'"



"ఊహూ. ఎందుకో?" గోముగా అడిగాడు,

"ఎందుకా? నా ఆరాధన ఈనాటికి గుర్తింపబడినందుకు. నా పూజలను స్వీకరించి నా దైవం తన కోవెల తలుపులను నాకై తెరచినందుకు!"

శ్రీమంత్ యినుమడించిన అనురాగంతో ఆమెను మరింత దగ్గరగా తీసుకున్నాడు.

"మరి నాకెలా వుందో చెప్పనా? పధ్నాలుగు లోకాలకూ అధిపతినైనట్లు!"

"ఎందుకో?"

"వకుళ అనే బంగారు బాల నా భార్య అయినందుకు!"

ఇద్దరూ హాయిగా నవ్వేసుకున్నారు.

"ఏమిటి వకుళా? అనుకున్నట్టుగా నిన్న వెళ్ళలేకపోయాము. మరి ఈరోజు కూడా లేదా ప్రయాణం?"

వకుళ వెంటనే సమాధాన మీయలేదు.

"ఏమిటి అభ్యంతరం చెప్పు వకుళా మన వివాహమై ఏడాది కావస్తున్నా మనం దూరంగానే వుండిపోయి ఎంతటి అమూల్యమైనదానిని వృథా చేసుకున్నామో తెలుసు. అందుకే ఇప్పుడా మధురిమ నంతనూ వడ్డీతో సహా అనుభవించుదాం, ఈ నిత్య తాపత్రయాలకు దూరంగా పోయి."

ఇప్పటికీ వకుళనుండి సమాధానం పొందని శ్రీమంత్ అనుమానంగా చూస్తూ ఆమె చుబుకాన్ని పట్టి ముఖం పైకి ఎత్తాడు.

దిగ్భ్రాంతితో అన్నాడు:

"ఏమైంది? ఎందుకా కన్నీరు?"

మందహాసంతో కనులొత్తుకున్నది వకుళ.

"ఇది అంత ఆనందం శ్రీమంత్! ఈ అపురూపమైన రోజు నా జీవితంలో రాగల దని అనుకోలేదు. నీకు నేను ఏమీ కానని-కాలేనని నిరాశతో కృంగిపడిన వేళ, నీవు కోరుకున్న యువతి నీకు కాకుండా పోయిన దుష్టఘడియలో నీవేమౌతావోనని నాలో భూకంపాలు చెలరేగినవేళ-నేను అనుకోని మార్పు నీలో కలిగింది; నీలో అనురాగసుధ పెల్లుబికింది అందుకే నా యీ ఆనందాశ్రువులు!"

చలించిపోయిన శ్రీమంత్ ఆర్ద్రహృదయంతో అక్కున జేర్చుకున్నాడు అర్ధాంగిని.

"హుం. అందుకా అంత జ్వరం తెచ్చుకున్నావు? ఎంతగా బాధించాను నిన్ను? నాలాటి మూర్ఖుడు ఎక్కడా వుండడు, వుండబోడు!"

"ఛ, అవేం మాటలు శ్రీమంత్ బాధ తర్వాతనే కదా సుఖం తీపి తెలిసేది!"

"సరి ప్రయాణానికి సిద్ధమేగా?"

"శ్రీమంత్! ఒక్క మాట చెబుతే కోపం రాదుగదా?"

"వంద చెప్పినా రాదు. ఏమిటది?"

సందేహిస్తూన్న వకుళ నేల చూపులు చూడసాగింది.

"చెప్పు వకుళా! అరమరికలు లేకుండా అన్ని విషయాలూ మాట్లాడుకోగల నాదే అసలైన ఆలుమగలు!"

"మరేంలేదు శ్రీమంత్ అనురాగం, ఆనందం మనస్సులకు సంబంధించినవి. అవి పొందడానికీ ఎక్కడికో పోనవసరంలేదు. ఎంతటి ఆనందంలోనైనా మన ఆర్థిక స్థితిని మరచిపోకపోవడం మనకే మంచిది!

శ్రీమంత్ వదనం గంభీరంగా మారిపోయింది.

"అవన్నీ నేనాలోచించ లేదంటావా?"

"నన, కానీ క్షమించు శ్రీమంత్. గృహిణిగా మన స్తోమతను నీకంటే నేనే ఎక్కువ అవగాహన చేసుకోవాలి. మనకు మన మిరువురమే కాదు మామయ్య వున్నారు; కొంతవరకూ శారద బాధ్యతలు కూడా వున్నాయి".

రెండు క్షణాలు మాట్లాడలేదు శ్రీమంత్

తదుపరి దరహాస వదనంతో అన్నాడు.

"నిజమే! ఎలగైనా ఆడవారికి ముందుచూపు ఎక్కువ! వారిద్దరూ, మన మిద్దరమూ కాక మరో ఇరువురు చిన్నారులు కూడా వస్తారుకదా ముందుముందు? అదా చేయవలసిందే మరి! శ్రీమతిగారి ఆజ్ఞ!"

సిగ్గుల మొగ్గే అయ్యింది వకుళ.

"నిజంగా కోపం లేదుగా శ్రీమంత్?" ఇంకా తగ్గని అనుమానంతో అతడి కనులలోనికి చూస్తూ అడిగింది.

"లేదు. నిజం వకుళా! వందనీయమైన నీ గుణాలను తెలుసుకొన్న కొలదీ ఆనాటి కానాడు నీపై గౌరవం పెరుగుతుంది ఎవరికైనా! నిన్ను చూచి గర్వపడు




తున్నాను."

అంతకంటె కావలసిన ప్రశంస ఏమున్నది ఏ భార్యకైనా?

"మరి నేనొక్కసారి వర్క్‌స్పాట్‌కు వెళ్ళి రావాలి. వచ్చేక కనీసం యీ ఇంటిలోనైనా కరుణించుతావా ఈ భక్తుడిని!"

"అబ్బ! ఈ చీకటి పడుతూన్నవేళ వర్క్‌స్పాట్‌కా శ్రీమంత్?"

నిట్టూర్పుతో సమాధానం చెప్పాడు శ్రీమంత్.

"ఏంచేస్తాం వకుళా? ఉద్యోగం అన్నాక కొన్ని బాధ్యతలు తప్పవు కదా! పైవాళ్లు ఎవడికివాడే మహారాజులా కూర్చుని క్రింది వాళ్ళను చెండుకు తింటారు కంపెనీ బాస్ తన స్వనివాసానికి కట్టించుకున్నాడు ఒక పెద్ద మూడంతస్థుల మేడ. అంతా అధునాతనం. అందుకు నైట్ షిఫ్ట్‌కు మనుషులు వచ్చారేమో, అవసరమైన సరుకంతా దిగుబడి అయ్యిందో లేదో చూడాలని నేను."

"సరేమరి! త్వరగా వచ్చేయి."

"ఆహా! నువ్వు అప్సరసలా తయారై వుంటానంటే!" అని కొంటెగా నవ్వాడు.

"ఎవరిలాగా వుండనునేను. వకుళ వకుళగానే శ్రీమంతుకు శ్రీమతిగానే వుంటుంది!"

లేని పెంకెతనం తెచ్చిపెట్టుకున్న ఆమె మాటలకు నవ్వుకుంటూ నిష్క్రమించాడు శ్రీమంత్.

# 37

మధ్యాహ్నం భోజనం అయిన దగ్గర నుండీ ఎడతెరిపి లేకుండా ఆడుతూన్న పేకాటతో విసుగు చెందింది శశిరేఖ.

సునీతా రోహిణిలు అతి నేర్పుగా ఆడుతున్నారు, అంతకంటె నేర్పుగా వాగుతున్నారు.

ఆ వాగుడులో ఎన్నో విషయాలు దొర్లిపోతున్నాయి. ఎందరి పేర్లో వినిపిస్తున్నాయి.

"నేనిక వెళ్తాను" అన్నది శశిరేఖ

ఏదో తప్పనిసరిగా మహేష్ ఆజ్ఞానువర్తియై అక్కడ వున్నదే కానీ, ఆమె తలపులన్నీ అతడిపైననే లగ్నమై వున్నాయి.

"అతడెక్కడ వుండి వుంటాడు? కంట్రాక్టు పనులలో తిరుగుతూంటాడా లేక సునీత వంటి మరో వనితతోనో విచ్చలవిడిగా....... ''

"ఏమిటంత పరధ్యానం? రండి యిల్లు చూద్దురు గానీ'' అన్నది సునీత.

మరోసారి చూస్తాను. వెళ్ళాలి. టాక్సీ పిలిపించండి''

''ఓ! ఇదంతా మహేష్‌పై విరహ బాధేనా? ఫర్వాలేదు. మీరు మరి కొంత ఆలస్యం చేస్తే అతడే వెదుక్కుంటూ వస్తాడు" అని నవ్వింది రోహిణి.

సునీత శృతి కలిపింది.

చీకాకుగా వున్నా, నిగ్రహించుకున్నది శశిరేఖ. వారి అతి చనువు అసంగీకారంగా వున్నది. అయినా వారిని కాదనుకుంటే మహేష్ కోపం రాగలదు.

ఇల్లంతా త్రిప్పి చూపించుతూన్న సునీత అన్నది.

"ఏమంత గొప్పయిల్లు లెండీ మావి చూసేందుకు! మీ స్నానాలగదులు కూడ మా పడక గదులకంటే మిన్నగా వుంటాయి. డబ్బువున్నా మేం వుపయోగించుకొనే అదృష్టం లేనివాళ్ళం."

శశిరేఖ మాటలాడలేదు. సునీత పడకగదిలో డ్రెసింగ్ టేబుల్ మీద నున్న సిగార్ కేస్, గాగుల్స్‌పై నిలచిపోయాయి ఆమె నేత్రాలు. అవి మహేష్‌వి! నిన్న హోటల్‌లో కూడ అవి అతనివద్దనే వుండటం చూచిన శశి గుండెలో బండరాయి పడింది.

మహేష్ తనను కవ్వించుతున్నాడో-పరీక్షించుతున్నాడోనని సరిపెట్టుకున్నది ఇంతవరకూ, కానీ అతడు గత రాత్రి ఇక్కడ సునీతతో గడిపాడనడానికిఋజువు దొరికింది.

"ఋజువులూ సాక్ష్యాలతో ఏం చేయగలవే నువ్వు? మహేష్ కనుసన్నలలో ఒదిగి ఒదిగి మసలవలసిన దానవు!" అని అంతరాత్మ హేళనగా అడిగింది.

"నీ కవన్నీ ఎందుకసలు? నీవు కోరిన ధన కనక వస్తువాహనాలన్నీ అతని వద్ద వున్నాయిగా? వాటితో తృప్తిచెందు!" మనస్సు హేళన చేసింది.

"విలువలేక విత్తం ప్రవహించేచోట నైతిక విలువలను ఆశించకే అవివేకురాలా?" హృదయం హితవు చెప్పింది.

'కానీ....కానీ మరీ యింతటి నైచ్యాన్ని ఎలా సహించడం? ఛీ, మహేష్‌తో




---

నేనిక కాపురం చేయగలనాః'

ఎదురు తిరిగిన అంతరాత్మను మనస్సు ఎదురు ప్రశ్నించింది.

'కాపురం చేయక నీకు వేరే దారి ఏమున్నది? శ్రీమంత్ ఎదుటా లోకం ఎదుటా ఓటమిని అంగీకరిస్తావా? సిరులన్నిటినీ తలదన్నే శ్రీమంత్‌ను కాదని సిరి గలవాడిని మగడిగా-అంగీకరించావుకదా?'

శ్రీమంత్ తలంపుతో అంతర్యుద్ధం ఆట కట్టింది.

"ఔను. నేను ఓటమిని అంగీకరించను" అని స్థిరనిర్ణయం చేసుకున్నది శశిరేఖ.

ఆమె రాకకే ఎదురు చూస్తున్నట్లుగా కూర్చుని వున్నాడు మహేష్ ఇంటివద్ద,

"ఏమిటి విశేషాలు?" అన్నాడు ఆత్రంగా.

శశి మౌనంగా ఒక కవరును అతడిచేత వుంచింది.

కవరు విప్పి చూసుకున్న అతడి ముఖం వికసించింది.

"అంత ముభావంగా వున్నావేమిటి?" అన్నాడు భార్యను.

సిగర్ లైటర్, గాగుల్స్ తీసి అతడి ప్రక్కన టేబుల్‌పై వుంచింది.

"ఇవి వాళ్ళిమ్మనలేదు నీకు. నీ వస్తువులని నేనే తెచ్చాను"

ఆ స్వరంలోని నిష్ఠురతను గమనించాడు మహేష్.

"ఎందుకు తెచ్చావ్? కుమార్‌కు నేనే యిచ్చాను. అటువంటి వస్తువులు ఎందరికెన్ని దానం చేశానో లెక్క లేదు!" అంటూ నవ్వేశాడు.

శశిరేఖ నవ్వలేదు.

"నిన్నకూడా వాటిని నీదగ్గర చూశాను. రాత్రిగానీ మరచిపోయావేమోనని తెచ్చాను!"

మహేష్ వదనం అప్రసన్నంగా మారినా, శాంతంగానే మాట్లాడేడు.

"చేకిటిజీ మై గుడ్‌గాళ్! బయట ఎన్ని రుచులున్నా-ఇంట నీ మహారాజ్ఞిత్వాన్ని కాదనను కదా! మంచి పనిమీద వెళ్తున్నాను నవ్వుముఖంతో పంపు. దిగ్విజయంగా తిరిగి వస్తాను!"

"ఏమిటా పని? ఈ రాత్రివేళా?"

"ఔను. ప్రాజెక్టు పనినిమిత్తం తెప్పించి గొడౌన్సులో వుంచిన సిమెంట్, స్టీలు-ఇంకా ఇంకా చాలా వుంటాయిలే. కొన్ని జాగ్రత్తగా కైవసం చేసుకోవాలి."

"ఎలాగ?!"

"అదంతా మాకు ఎప్పటినుండో అలవాటైన విద్య! ప్రాజెక్టు ఇన్‌ఛార్జి మన చేతిలో వున్నప్పుడు ఎన్నైనా జరుగుతాయి!"

నిర్విణ్ణురాలై చూడసాగింది శశిరేఖ.

"చూశావా మరి నీ భర్త తెలివి! వాళ్ళ సరుకులు వాళ్ళ పనులకే వినియోగించి, మరలా బిల్లు లాగుతాను వాళ్ళనుంచి! డబుల్ ప్రాఫిట్!"

"మళ్ళీ రావడం ఎప్పుడు?"

"బహుశః రేపు మధ్యాహ్నం. నువ్వు తోచకపోతే రేపూ వెళ్ళొచ్చు కుమార్ యింటికి"

త్వరత్వరగా డ్రెస్ చేసుకు వెళ్ళిపోతూన్నతడికి దగ్గరగా వెళ్ళింది శశి.

"మహేష్!"

"చెప్పు"

"డబ్బుకోసం-అమూల్యమైన జీవితాన్ని కాలాన్ని నిర్లక్ష్యం చేస్తున్నావా?"

మహేష్ కనబొమ్మలు ఆశ్చర్యం ప్రకటించుతూ పైకి లేచాయి.

"నీకు కావలసింది డబ్బుకదా మరి? హిహ్హిహ్హా!"

నిష్క్రమించుతూన్న అతడిని నిస్సహాయంగా చూసింది-కనుల నీరు జాలువారుతూండగా!

"తనకు డబ్బే ముఖ్యం!"

చెప్పుదెబ్బకూడ యింతగా బాధించదేమో!

మహేష్ ఎంతటి నిరంకుశుడు! మరెంత నిర్భయుడు!

(సశేషం)

# విమ్ వాడటంలేదా ఏమిటి?



## శుభ్రంచేసే మరే యితర పౌడర్‌కన్నా జిడ్డును తీసేసే శక్తి మరింతగా వుంది విమ్‌లో

శుభ్రం చేసే సాధారణమైన పౌడర్లు జిడ్డును సరిగ్గా తీసెయ్యలేవు.
మీ పింగాణీ, గాజు, స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్ర సామగ్రి
పైన పొగర్ తాలూకు అవశేషాలూ, మచ్చలూ,
మరకలూ మిగిల్చేస్తాయి అవి.

విమ్‌లో జిడ్డును తీసేసే శక్తి మరింత
ఎక్కువగా ఉంది. అది మీ టేబుల్
మీది పళ్లాలనీ, పాత్రలనీ ఎంతగా
శుభ్రపరుస్తుందంటే,
అవి తళతళ మెరుస్తాయి.

మీ ఇంట్లోని పాత్రలకి
ఒక విమ్ మెరుపును ఇవ్వండి.




**విమ్**

**తళతళ తప్ప ఏమీ మిగల్చదు.**

LINTAS-V.86-1810 TL

హిందుస్తాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

# ఆ క్షణం నీది చేసుకో

"నేను బావనే పెళ్లాడుతాను" నాన్నతో అంది ఇందిర దృఢంగా.

ఆ మాటకి తల్లిశాంతమ్మగారు అదిరి పడింది.

"అమ్మో! బావనే"అంది గుండెమీద అరచేతులుంచుకొని.

"అవును బావనే" అంది తాపీగా ఇందిర.

కూతురికేసి విస్తుబోయి చూసారు నారాయణరావుగారు. క్షణం తనచెవుల్ని తానే నమ్మలేక పోయాడు.

"నీ కేమన్నా మతిపోయిందా, తెలిసీ ఆ అగ్నిగుండంలోకి దూకుతావా" మెత్తగా మందలించాడు.

"సీతాదేవి కాలంనుంచీ ఇది ఆడదానికి తప్పడంలేదునాన్నా-నేనూ ఆడదాన్నేగా. అందుకే, ముందే దూకాలని నిశ్చయించుకున్నాను. కానైతే సీతాదేవి నాటి కాలం పరిస్థితులువేరు. ఆవిణ్ని ఆవిడ పవిత్రతో, దేవతలో వచ్చి, రక్షించి, ఒడ్డుకెక్కించారట. ఇప్పుడలా చేస్తే ప్రమాదం. ఏ దేవతలూ, ఏ పవిత్రతా ఇప్పుడు కాపాడవు! మనల్ని మనమే కాపాడుకోవాలి. ఆ తెలివి గలిగి ఉండాలి. అంతే"

"ఊరుకో. పిల్లకాకి కేం తెలును ఉండేలు దెబ్బ అని చిన్న పిల్లవి. నీకేం తెలును. వాళ్లు దుర్మార్గులమ్మా. డబ్బాశాపరులు-తెలిసీ" - మాట మధ్యలో ఆపేసారు.

అప్రయత్నంగా ఆయన చేయి తల మీదకు వెళ్ళింది.

"డబ్బాశ ఎవరికిలేదు నాన్నా ? ఈ ప్రపంచంలో అందరికీ ధనదాహం ఎక్కువై పోయింది. అందుకే దరిద్రమూ దౌర్జన్యమూకూడా ఎక్కువై పోయాయి. మానవత్వము,మమతానురాగాలు మంటలో పడి భస్మమవుతున్నాయి. మీకు మాత్రం డబ్బాశ లేదా నాన్నా" అంది భావయుక్తంగా తండ్రికేసి చూస్తూ .. క్షణం ఆగి- "ఆ పొలానికేదో ఖరీదుకట్టి వాళ్ళ మొహాన్ని విసిరికొట్టవలసింది."

ఆయన తలదించుకున్నారు బాధగా. నిట్టూర్పు విడిచారు.

"ముందొచ్చేది ఏం తెలుస్తుందమ్మా" అన్నారు. క్షణంఆగిరోషంతో- "అలాంటి చోటుకు నువ్వెందుకు వెళ్ళాలనకుంటున్నావ్? వాళ్ళతో మనకేమిటిసంబంధం?" అన్నారు ఆవేశంగా.

"ఉంది నాన్న ఉంది"

ఆదిమధ్యాం రమణమ్మ



"వాళ్ళతో నువ్వునెగ్గలేవమ్మా. వాళ్ళ ఊసే మనకొద్దు. నీకు బంగారం లాంటి సంబంధం లోకమంతా గాలించి చేస్తాను"

"ఈసంబంధం మాత్రం బంగారం లాంటిది కాదా నాన్నా. ఏది మాత్రం ముందు తెలుస్తుందంటావ్? మనమే వరి

స్థితులలో నెగ్గుకు రావాలి"

"నీవనుకున్నంత తేలిక కాదు నెగ్గుకు రావటం"

"లేక పోతే వదిలేస్తాను"

"వదలడమూ అంత తేలిక కాదు మన సంప్రదాయము ఆచారాలు-"

"ఆపు నాన్నా ఆపు. సంప్రదాయమంటూ చెడును కూడా పోషించుకు రావడం మంచిది కాదు. అందుకే అక్క అలా బలిసిపోతోంది. అయినా డబ్బున్న వాళ్లు ఏం చేసినా చెల్లుతుంది. ఎవరు ఏమీ అనలేరు. ఏమీ చేయలేరు. అయినా అపవాదుకు జడవడానికి, నా తరువాత నీకు ఆడపిల్లలూ లేరు. మనం ప్రగతికి ఎప్పుడూ- ఒక్క అడుగైనా ముందుకు వెయ్యాలి గాని వెనక్కి కాదు నాన్నా- అసలు ఎవరైనా ముందుకు నడుస్తారుగాని వెనక్కి నడుస్తారా?"

"ఎందుకమ్మా నీకీ పట్టుదల?" అన్నారు ఆమెతో వాదించలేక. నిస్పృహతో తలమీద చేతులుంచుకున్నారు. కూతురు ఆంతర్యమేమిటో ఆయనకి అంతుబట్టలేదు. పెద్దపిల్ల గుర్తుకువచ్చి దుఃఖంతో కళ్ళు చెమ్మగిల్లాయి. గొంతు పూడుకుపోయింది.

తండ్రీ కూతుళ్ళ వాదనంతా విన్నది శాంతమ్మగారు. ఆమెకు దుఃఖమల్లా రోషం, రోషమల్లా కోపంలోకి దిగింది. ఆవేశంలో కోపంలో ఆవిడ ముక్కుపుటాలు అదురుతున్నాయి.

"ఏమిటే నీ వాగుడు. నీకేమైనా దయ్యం పట్టిందా? ఆదౌర్భాగ్యుడు బావ తప్ప నీకు, మొగుడే దొరకడా?" అంది రొప్పుతూ.

"దొరుకుతాడమ్మా దొరుకుతాడు. కానీ నాకు బావకావాలి" అంది మొండిగా.

"ఎందుకట. మనల్ని అతడు ఉద్ధరించాడనా?"

అలా అంటూంటే ఆమెకు దుఃఖం పొంగిపొర్లి వచ్చింది. నోట్లో పమిట చెంగు కూరుకుని, ఏడుస్తూ లోపలి గదిలోకి వెళ్ళి మంచంమీదపడి వెక్కి వెక్కి ఏడుస్తోంది.

ఆమె వెనకాలే నారాయణరావుగారూ లోపలకెళ్ళి తానూ కన్నీరు కారుస్తూనే- ఆమెను ఓదార్చాడు.

కొన్ని క్షణాలు ఆగి బరువెక్కిన గుండెతో - తానూ గది దగ్గరకొచ్చి, గుమ్మంముందు ఆగిపోయింది ఇందిర.

"అమ్మా దుఃఖం మనుషుల్ని బలహీనుల్ని చేస్తుంది. మనం బలహీనులమైతే బలవంతులు మనమీద జులుం చెలాయిస్తారు. ఆ జులుంను, మనం అరికట్టాలి." ఆవిడ కళ్ళు తుడుచుకుంటూ ఆవేశంలో లేచి కూర్చుంది.

"నీ తొందర. కుర్ర సన్నానివి నువ్వు వాళ్ళనేం చేయలేవు. చూస్తూ చూస్తూ నిన్ను గోతిలోకి దింపను"

"అన్యాయాన్ని చూస్తూ వూరుకుంటే అవి తెగబలిసి, జనాన్ని మరింత కాల్చుకు తింటాయి అందుకే వాటిని తెగనాడాలి తెగనరకాలి."

"అందుకు నీ బతుకును వాళ్ళచేతుల్లో పెట్టమంటావా? వాళ్లు సర్వనాశనం చేస్తారు"

"నా బతుకుని నేను ఎవరి చేతుల్లోనూ పెట్టను. నా చేతుల్లోనే ఉంచుకుంటాను. నన్నెవ్వరూ ఏం చేయలేరు"




"అబ్బ! నీతో నే వాదించలేను బైటకి పో" అంది శాంతమ్మగారు విసుగొచ్చి.

ఇందిర ముందు హాల్లో కొచ్చేసింది.

"వీళ్ళతో వాదించడం అనవసరం. వీళ్ళు నూతన భావాల్ని జీర్ణించుకోలేరు. తనపంతం నెగ్గించుకోవడమే అవసరం!" అనుకుంది.

ఇందిర బైటకి వెళ్ళిపోయాక "నా కడుపులో మళ్ళీ మరో చిచ్చు పెట్టకండీ" -అని బొరుమని ఏడుస్తూ భర్త వళ్ళో వాలిపోయింది

○ ○ ○ ○

తలిదండ్రులు ఎంత వాదించినా, ఇందిర వినలేదు.

"చేస్తే బావతో పెళ్ళిచేయండి లేకుంటే నాకసలు పెళ్ళే వద్దు" అని భీష్మించింది.

ఇదెందుకొచ్చిందో-దాని ఉద్దేశ్యమేమిటో ఏం జరిగితే అదేజరుగుతుందని ఆమె తండండ్రులు ఒప్పేసుకున్నారు.

ఇందిర ఉంటున్నది పట్నవాసమే.

కలిగిన ఇంట్లోనే పుట్టింది అపురూపంగానే పెరిగింది. డిగ్రీ తెచ్చుకుంది. చామన చాయ రంగులో పెద్ద అందగత్తె కాకపోయినా ఆకర్షణీయంగా ఉంటుంది.

ఇందిర పెళ్ళి జరిగి పోతోంది.

ఇందిర తలిదండ్రుల కిదేమీ సంతోషాన్ని కలిగించడంలేదు.

ఇందిరకు మాత్రం సంతోషంగానే ఉంది.

ఆ సంతోషం, పెళ్ళి అవుతుందనీ కాదు, అందమైన బావ భర్త అవుతున్నాడనీకాదు ఆమె సంతోషం-ఎవరి ఊహకు అందడంలేదు.

పెళ్ళి అయిపోయింది.

కార్యం గదిలో ఏవిధమైన సిగ్గూ సంకోచంలేకుండానే, మంచందగ్గరకొచ్చి బావపక్కన కూర్చుంది. అలవోకగా

## దర్పణం

**బింబం :**
అధికార మదాంధత ఓక్కబడుతోంది
రాజకీయాల కసాయికత్తి
సూర్పబడుతోంది
స్వేచ్ఛా స్వాతంత్ర్యాల గొడ్డు
వొట్టిపోయింది
సందేశం దేశాలు పట్టిపోయింది

**ప్రతిబింబం :**
గలేబులో దాచుకున్న కళ్ళు
పొన్నును
అశ్రుజలధిలో ఆదిశేషుని చేశాయి
ఈ నరకం
జీవిత సదృశంగా వుంది

**సుధామ**

వడుకుని ఆలోచిస్తూన్న సూర్యం విస్తుబోయాడు. ఆతరువాత చిన్నగానవ్వుతూ ఇందిర చేయి అందుకున్నాడు.

"ఇందూ మీఅక్క నన్ను అన్యాయం చేసి వదిలిపోయినా కనికరంతో నీవు నా చేయి అందుకున్నావు థేంక్స్" అన్నాడు. "కనికరంలో కాదు కోపంలో అందుకున్నాను" అని మనసులో అనుకుంది. ఆ సమయంలో అబద్ధమాడలేక చిన్నగా నవ్వి ఊరుకుంది.

నవ్వు నాలుగు అర్థాల నిస్తుంది. అందులో అతని కేది స్ఫురిస్తే అది అనుకుంది.

"మాట్లాడవేం" అన్నాడు.

"ఏం మాట్లాడేదీ-నువ్వే మాట్లాడు" బావా!" అంది.

"పాపం మీ అక్క" అని, ఏదో అనబోయాడు.

"ఇప్పుడు అక్క మాటేమీ తేకు" అంది.

అలా అంటున్నప్పుడు ఆమె గొంతు జీరపోయింది

క్షణం ఏం మాట్లాడాలో తోచక ఊరుకున్నాడు. ఆ తరువాత ఇందు మనోభావాలెల ఉంటాయో ఆవిషయంతో తెలుసుకోవాలని ఆదుర్దాగా ఉంది అతనికి. ఇందు ఎందుకు తనని పెళ్ళిచేసుకుందో అదీ అనుమానంగానేఉంది. అది ఏదో విధంగా తెలుసుకోవాలని తొందర పెడుతోంది అతనిమనసు.

"ఇందూ రెండోపెళ్ళికి కట్నం పుచ్చుకోవడ మెందుకని నేనే మావాళ్ళని అడగొద్దన్నాను"

"మంచిది బావా. మీరు అడక్కపోయినా నాకియ్యవలసిన నావంతు కట్నం లక్షా నాపేర బేంకిలో ఉంది. మీకు ఎప్పుడు కావాలంటే అప్పుడు చెక్కురాసి ఇస్తాను. ఇపుడే రాయమంటావా" అంది నవ్వుతూ.

అమె అలా అన్నాక తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు. ఇందు సరళ కాదు. చలాకీ అయిన పిల్ల. ఆడపిల్లలిలా ఉండాలి హుషారుగా. ఇక డబ్బుగురించి తగాదాలు వచ్చే సావకాశం లేదు అని



నంబరపడ్డాడు పైకి-

"అహాఁ ఇపుడెందుకులే ఉండనియ్యి నీదగ్గర. నీవే నాదానివైనపుడు, నీడబ్బు నాది కాకుండా ఎలా పోతుంది?" అన్నాడు మాటల్లో జాగ్రత్తపడుతూ

"నా డబ్బే నీ మొహాన్ని కొడతాను. నేను నీదాన్ని కాదురోయ్" అనుకుంది మనసులో.

ఇక ఏ సంగతులు లేనట్లు ముందు బావగారు డబ్బు సంగతే తేవడంతో- ఇందిర మనసు నిప్పుతొక్కిన కోతిలా అయింది. నిగ్రహాన్ని కోల్పోతానేమో అన్న భయం పట్టుకుంది ఏంచెయ్యాలో ఏమనాలో తోచక పకపకా నవ్వింది. నవ్వి ఊరుకోలేదు. బావ బుజాలు పట్టు కొని కుదిపేసింది.

"ఏంటిది ఇందూ పిచ్చి పట్టిందా నీకు" అన్నాడు ఆమెను వారిస్తూ.

"నీ అందం నన్ను పిచ్చిదాన్ని చేస్తోంది బావా. ఆడదాని కుండవలసిన అందం, గుణమూనూ నీవి ఎంత ముద్దొస్తున్నావో."

ఇంక తాను వుదాసీనంగా ఉంటే, ఆమె ఇంకా విజృంభిస్తుందేమో అని ఆమెను తన చేతుల్లోకి తీసుకున్నాడు. ఇయం భయంగా అతని రెండుచేతులూ విడిపించేసుకుని తానే అతణ్ని రెండు చేతులా బంధించి, ఉక్కిరి బిక్కిరి చేసి పారేసింది.

○ ○ ○

మొదటి కోడలు పోయింది. అది అమాయకురాలు. ఇది కొంచెం గడగ్గా యిలా వుంది. ముందు కొంచెం ఆనపాను తెలుసుకోనిదే తొందర పడకూడదు అనుకుంది సూర్యని తల్లి సుభద్రమ్మ.

అందుకని, కోడలు ఏ వేళకి లేచినా ఏం పనులు చేసినా, చేయక పోయినా ఓ కంట గమనిస్తూ ఉండిపోయింది.

ఎవర్నీ ఖాతరు చేయను అన్నట్లు నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తోంది ఇందిర.

నెమ్మదిగా నెమ్మదిగా తల్లి సలహాతో చెక్కులమీద సంతకాలు చేయించి, ఇందిర పేరనున్న డబ్బంతా తన పేర బేంకిలో జమ చేసాడు సూర్యం.

"రా. రా. ఎంత వరకూ వస్తావో" అని మనసులో అనుకుని ఏ పేచీ లేకుండానే డబ్బంతా అతనికి ఇచ్చేసింది ఇందిర. డబ్బు సంగతి పూర్తయాక, వో రోజు పొలం సంగతి ఎత్తాడు.

"ఇందూ మీనాన్నగారు నీపేర పొలం రాసారా. అదే పసుపు కుంకుమలకి"?

"ఏం? రాసారు"

"శిస్తులు ఇస్తారా?"

"ఎందు కియ్యరూ?"

"ఆపొలం అక్కడెందుకూ అమ్మేసి వచ్చి ఇక్కడే కొందాం" అన్నాడు ఎటో చూస్తూ—

"పొలం మాత్రం అమ్మను" అంది తాపీగా

సూర్యానికి కోపం వచ్చింది ఆ జవాబు వింటే.

"ఎందుకమ్మవు?" అన్నాడు.

"అది నా ఇష్టం అది మావాళ్లు నాకిచ్చిన సొత్తు. డబ్బైతే మీకు కట్నంగా ఇచ్చినది. కాబట్టి ఇచ్చేసాను. పొలం నా పసుపుకుంకుమల కిచ్చినది. అదీ దానిమీద వచ్చే శిస్తు నా ఇష్టం వచ్చినట్లు ఖర్చు చేసుకుంటాను. దానిమీద సర్వ హక్కులూ నావి. దీనిగురించి మీరేం చెప్పినా చేయను" అంది ఆవేశంతో. అంతతో ఊరుకోక – "అయినా మీకు పొలాలు లేవా? నా పొలం గొల మీకెందుకు?" అంది.

సూర్యం కోపం కట్టలు తెంచుకుంది.

"ఇందూ" అరిచాడు-ఏమో చేయాలని ఉన్నా తమాయించుకున్నాడు.

"ఇందూ అధిక ప్రసంగం చేస్తున్నావు. అక్కడ పొలం ఎందుకు ఇక్కడ కొంటానన్నాను. తప్పా?"

"తప్పులేదు కాని పొలం విషయంలో మీరేం చెప్పినా చేయను" అంటూ బీరువా తెరిచి చీర, టవలూ భుజాన వేసుకుని స్నానానికని క్రిందకి దిగిపోయింది.

ఇందిర వెనకాలే తానూ మేడదిగాడు సూర్యం.

ఇందిర బాత్‌రూంలోకి వెళ్ళగా చూసి వంటింటిలో చల్ల చిలుకుతున్న తల్లి దగ్గరకు చేరి విషయమంతా వివరించాడు.

"మొండి ఘటం అమ్మా-జాగ్రత్తగా మసలుకోవాలి" అన్నాడు. దీనిదగ్గర మన ఆటలు సాగవు అన్న ధోరణిలో.

ఇందిర బాత్‌రూంలో స్నానం ముగించి, చీర ఒంటినిండా చుట్టుకు వంటింటిలోకి రాబోతూ-ఆగిపోయి రెండడుగులు వెనక్కి వేసింది.

తనగురించే తల్లీకొడుకులు ఏవో మంతనాలు సాగిస్తున్నారని విన్నాక-ఒళ్లు, మనసు భగభగా మండిపోతుండగా ధీమాగా వంటింటిలోకి అడుగు పెట్టింది. ఆమె నిడుపాటి కురులు నీరు కారుతున్నాయి.

తల్లీకొడుకుల్ని చురచురా చూస్తూ నిల్చుండి పోయింది. ఏదో రాద్ధాంతం చేద్దామని. ఆమె మనసూ ఆరాటపడు




తోంది ఇంతలో-

"మా అమ్మ నీ పొలం అక్కడెందుకు-అమ్మేని తెమ్మంటోంది" అన్నాడు సూర్యం. అగ్నిలో ఆజ్యం పోసినట్లు.

"మీ అమ్మే కాదు మీ అమ్మతాతమ్మ చెప్పినా ఆపొలం అమ్మితేను. ఏంచేస్తారో చేసుకోండి" అంది ధీమాగా.

"ఇంకా చూస్తావేంరా దాని అక్కకి చేసినట్లే చేయి' అంది అతని తల్లి. ఆ మాట వినడంతోనే ఇందిరకి కొరడాతో కొట్టినట్లు అయింది. నిలువెల్లా కంపించి పోయింది. ఆమె కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయాయి. పడగెత్తిన సర్పంలా- అత్తగారివైపు ముఖం తిప్పింది-"అయితే మా అక్కని కాల్చింది మీరేనన్నమాట. అది స్టౌ కాలి చావలేదన్నమాట!" ఆమె నిలువెల్లా ఆవేశంతో కోపంతో ఊగిపోతూ అత్తగార్ని కాల్చేలా చూస్తుండగా

సూర్యం-అర నిముషంలో ఆమెపై కిరసనాయిల్ కొద్దిగా వంపి - అగ్గిపుల్ల గీసేసాడ-

ఊహించని అతని ఈ చర్యకి విభ్రాంతిలో నిశ్చేష్టఅయి భయవిహ్వల అయి- ఒక సెకను తటపటాయించింది ఇందిర - మంటలో అక్క కన్పించింది కర్తవ్యం సూచించింది చుట్టబెట్టిన చీర కాబట్టి చులాగ్గా వదిలించుకుంది. చేతులు కాలిపోతున్నా లెక్కచేయక, మండే చీర తీసుకెళ్ళి భర్త మీదకు విసిరి కొట్టింది. కిరసనాయిల్ పడి, అక్కడక్కడా ఒళ్ళు అంటుకుంది. ఒక్క పరుగులో అత్తగారు చేస్తున్న మజ్జిగకుండ ఎత్తి మీద పోసుకుంది. ఆ తరువాత ఆ కుండ అత్తగారి ముఖాన్నేసి కొట్టింది. ఇంక ఒక్క క్షణం ఆ ఇంట్లో ఉంటే ప్రాణాలు దక్కవని, నగ్నంగా ఉన్న విషయం కూడా విస్మరించి ఒక్క దాటున వీధిలోకి పరుగెత్తి ఎదురింటిలోకి దూకింది, "రక్షించండి రక్షించండి" అని అరుస్తూ.

# ఆర్ద్రినెన్ను

తలుపులన్నీ మూసెయ్యండి
తలపుల్ని బంధించండి
బుద్ధితో యుద్ధం చెయ్యాలని
చూస్తున్నాడు వీడు-
చేతుల్లో అగ్నిపర్వత శతఘ్నిని
పట్టుకొస్తున్నాడు-
చేతల్లో భగ్నభయోద్విగ్న
చేతస్కుడు-
కాళ్ళకు సంకెళ్లెయ్యండి-
కలాన్ని ఉరితియ్యండి-
పయత్నులో వెలగబోతున్న
విద్యుజ్జ్వాలికా భావాల్ని
వింతగా సమాధి చెయ్యండి-

**శైలకుమార్**

ఉదయాన్నే ముందుగదిలో ఈజీ చైర్‌లోవాలి, పేపరు చదువుకుంటూన్న మధు ఆ అరుపుకి అదిరిపడి కుర్చీలోంచి లేచి నించున్నాడు.

నగ్నంగా జుట్టు విరబోసుకుని నిలువెల్లా మజ్జిగ వోడుతూ వచ్చిన ఎదిరింటి కోడలు ఇందిరని చూసి నిలువునా స్థాణువయాడు.

ఇంతలో అతణ్ని వాటేసుకుని మొల్లుమంది ఇందిర. భయంవల్ల ఆమె శరీరం నిలువెల్లా కంపించి పోతోంది— క్షణం అతని బుద్ధి పని చేయలేదు. పని చేసాక చక చకా ఇందిరని లోపలి గది లోపలికి తీసుకవచ్చి పడకో బెట్టి, పైన తల్లి చీర కప్పి, వీధి తలుపులు గడియ పెట్టి, దొడ్లో పనిచేసుకుంటున్న తల్లిని పిలవడానికి వెళ్లాడు.

ఆదుర్దాగా పరుగెట్టుకొచ్చింది తల్లి

నిలువెల్లా ఒణికిపోతూ, ఒంటి మీద తెలివి కోల్పోతూ, హీనస్వరంతో "వాళ్లు-వాళ్లు-కాల్చారు - కిరసనాయిలు- నన్ను నన్ను మా వాళ్ళకప్పగించండి-" అని చేతులు జోడించింది.

తల్లి సహాయంతో చేయవలసిన ప్రాథమిక చికిత్సచేసి క్షణాల మీద కారులో పట్నం చేరి అస్పత్రిలో చేర్చి, ఇందిర తల్లిదండ్రులకు విషయం తెలియ పరిచాడు మధు.

తన ఒళ్లు ప్రమాదంగా కాలలేదుగాని భయంవల్ల స్పృహకోల్పోయింది ఇందిర.

"వద్దంటే విన్నావాతల్లీ అగ్నిగుండం లోకి ఉరికావు కాదే" అని తల్లి మొత్తుకు ఏడ్చింది.

"ఊరుకో-సంబాళించుకో - నాతల్లి చచ్చిపోదు. బ్రతికి తీరుతుంది. ఈసారి వాళ్ళఅంతుచూస్తా" అన్నాడు నారాయణ రావుగారు....... .

తరువాత జరిగిన కథ

ఇందిర ఒక వారం రోజుల్లోనే కోలుకుంది. సూర్యం ప్రాణం పోలేదగాని ఒళ్ళంతా బాగా కాలి పోయింది.

బాగవడానికి ఆరు మాసాలు పడుతుంది అన్నారు కుండపెంకు గుచ్చుకొని కన్నుబాగాగాయమయింది సుభద్రమ్మకి. కన్నురాదన్నారు.

ఇందిర తలిదండ్రులకు గుండెలెంత

శ్రీరామ్ ఫిలింస్

# చలాకీ చెల్లెమ్మ

నిర్మాత-దర్శకుడు
**జానకిరామ్**

సంగీతం: రమేష్ నాయుడు
మాటలు - పాటలు: గోపి

కలర్

ఫోటో: వి.యం.సి.



SREE PUBS

మండిపోతున్నా పరువు బజారు కెక్కడం ఇష్టంలేక ఊరుకున్నారు.

వారు ఊరుకున్నా వియ్యాల వారు ఊరుకోలేరు.

కొడుకుమీద కోడలు హత్యాప్రయత్నం చేసిందని కోర్టుకెక్కారు. అది కొరివితో తలగోక్కున్నట్లే అయింది.

వాళ్ళు నెగ్గలేదు. ఇందిరే నెగ్గింది.

సిగ్గుచేటయిన విషయమే అయినా కోర్టుకు సాక్ష్యమేముఖ్యం కాబట్టి వధు కోర్టులో జరిగినదిజరిగినట్లు చెప్పేసాడు.

ఇందిర తలిదండ్రులు సిగ్గుతో బతికి పోయారు.

"ఏంపిల్లలు బాబూ ఈకాలం పిల్లలు మానానికి మగ్గి బతకాలిగాని ఇలాగా" అనుకున్నారు మామూలుగా.

ఇందిర వాళ్ళ నోరు మూయించింది తన వాగ్ధాటితో.

ఒక రోజు మధు ఇందిర ఇంటికి వచ్చాడు. ఇందిర ఒంటరిగా ఉంది. అతనికి మంచి అవకాశం చిక్కింది.

"ఇందిరా, పురుషుడు నలుగురిలో తిరిగీ, ముగ్గుర్ని పెళ్ళాడీ, తన శీలం పవిత్రత ఎంతమాత్రం చెడు, చెదరలేదు అనుకుంటాడు కానీ మన భారతస్త్రీ తన శీలాన్ని ఎంతో పవిత్రంగా చూసుకుంటుంది. ఎన్నోయుగాలనుంచీ ధర్మాన్ని పరిపుష్టిగా పోషిస్తూ వస్తున్నది ఆమే. బలిఅయిపోతున్నదీ ఆమే. మంచి ఫలితమేమీ రావడం లేదు. ప్రాణభయంతో సాహసంచేసి విషమ పరిస్థితిలో నా చేతుల్లోకి వచ్చి వాలావు. చితికిన నీ శీలాన్ని నా చేతుల్లోకి తీసుకుని సంరక్షిద్దామని నా ఉద్దేశ్యం. నీ కెలాగూ విడాకులు ఇవ్వక తప్పదు.

న్యాయంకోసం సాహసించిన నీచేయి పట్టి జీవితభాగస్వామిని చేసుకుందామని చెలిమితో సాగిపోవాలనీ నా కోరిక. నువ్వు నాకోరికను మన్నిస్తావని ఆశిస్తున్నను" అని-ఆశగా ఆమె కళ్ళలోకి చూసాడు-

ఆమె సిగ్గుతో తలవాల్చుకుంది కొన్ని నిముషాలు ఏమీ జవాబియ్యలేక పోయింది ఆతరువాత - "నీవంటి పుణ్యపురుషులు చేయిఅందిస్తానని - ముందుకు వస్తుంటే" మధ్యలో మాటఆపేసి అతని కళ్ళల్లోకి చూసింది. ఆ కళ్ళలో-నీలిమేఘమాలికల్ని దూసుకు పోయే మెరుపు తీగ కనిపించి-అతని మనసు అనురాగమాలిక ల్లింది-

ం ం ం

కాలి వికృతంగా తయారయి జైలు శిక్ష అనుభవిస్తున్న కొడుకుని చూసి-సుభద్రమ్మ ఒక నిట్టూర్పు విడిచింది. మరు క్షణంలో కోలుకుని -"ఏమిట్రా మగాడివి-నీకేం లోటు-విడదల్తై రాగానే దాని తాతలాంటి దాన్ని మరో దాన్ని తెచ్చి నీకు చేసి, దాని రోగం కుదురుస్తాను" అంది వోదారుస్తూ-

"ఛీఛీ మీఆడవాళ్ళకి జ్ఞానంలేకుండా చేసి, మాకజ్ఞానం లేకుండాచేసుకున్నాం మీకు బుద్ధి రావడం లేదు. మాకు లేదు. ఉంటే ఇలా బ్రతుకులు కాలిపోవమ్మా-ఛీ-నీ ముఖం నాకు చూపించకు. వెళ్ళి ఆ లక్షలు కట్టుకుని పడకో- నే బైటకి వచ్చాక సంగతి తరువాత చూద్దాం-" అని ముఖం తిప్పేసుకున్నాడు సూర్యం. కొడుకుని చోద్యంగా చూస్తూ-తలపించుకుంది సుభద్రమ్మ.






జ్యోతి ఆగష్టు సంచిక గెటప్ కన్నుల విందు అనిపించింది. స్వర్ణగారి కార్టూన్స్ "నటుడే నాయకుడైతే" నవ్వుల మల్లెలుగా ఉన్నది. సౌభాగ్యలత సీరియల్ ఆడపిల్లలకు వాస్తవంగాను, జీవితానికి దగ్గరగానూ వుంది. "మబ్బుచాటు నక్షత్రం" చిన్నకథ అయినా రచయిత్రి నేటి స్త్రీల జీవితాలను చక్కగా వ్రాసింది. "నువ్వంటే నాకెంతో ఇష్టం" 'ముల్లుతురి మినమొగ్గ' కథలుచదివితే మనసుకుబాధ అనిపించింది

ఆండాళ్ కుమారి, సి.
హనుమకొండ.

ఆగష్టు నెల విడుదలైన జ్యోతి సంచికలో ప్రచురించిన "నువ్వంటే నాకెంతో ఇష్టం" దమయంతిగారి కథలో యవ్వనంలో అడుగెట్టి అందంగా వున్న క్లర్కు అనురాధలో తన తల్లిని చూసుకుంటూ ఆనందించానని చెప్పడం మమ్మల్ని ఆశ్చర్యపరిచింది. పాలకోడేటి సత్యనారాయణరావుగారి కథ 'తల్లీ... గోదారీ... !' ఇంద్రగంటి జానకీబాల గారి కథ "అంతర్యం" అమోఘంగా అద్భుతంగా చక్కని శైలిలో చాలా బాగున్నాయి. కథల విషయంలో మీరు తీసుకుంటున్న శ్రద్ధకు మీకు నా అభివందనాలు. కార్టూన్ పోటీలో "ద్వితీయ" బహుమతి పొందిన "నటుడే-నాయకుడైతే" కార్టూన్లు నన్ను బాగా నవ్వించాయి. కార్టూనిస్ట్ "స్వర్ణ" (స్వర్ణ లక్ష్మీకాంత మోహన్)గార్కి నా హృదయ పూర్వకాభినందనలు.

జి. సాంబశివరావు,
నేలకొండపల్లి.

ఈనెల ఆగష్టు జ్యోతి, క్రిందటి నెల జ్యోతి చూచినాను చాలా ఆకర్షణీయంగా వున్నవి సుమండీ!

ఇక పోతే యీనెల జ్యోతిలోని 'స్వర్ణ' గారి కార్టూన్లు చాలా చాలా బాగున్నాయి సార్!

"స్వర్ణ" "ఆడపిల్ల" అనుకొన్నాను యింతకు ముందు. మీ పరిచయాన్ని బట్టి "మగ"గా తేలారు. ధాంక్యూసార్!

ఈ నెలా క్రిందటి నెలా కార్టూన్ల ప్రత్యేక సంచికలు అనిపించి మమ్మల్ని నవ్వులజల్లులలో ముంచిన చిత్రకారులను అభినందిస్తున్నాను జ్యోతి సంపాదకవర్గానికి నా ధన్యవాదాలు.

ఇలాగే కార్టూనిష్టులను ప్రోత్సహిస్తూ జ్యోతి ముందుకు అడుగులేస్తూ మా కనులకు విందు, మనసుకు పసందుచేకూర్చాలని కోరుచున్నాను.

చావలి విశ్వనాథం,
పటంచెరు.

# సాంస్కృతిక విశేషాలు

## కళాసౌరభం కొత్త సంచిక

ఇది స్వర్గీయ శ్రీ "గోరాశాస్త్రిగారి ప్రత్యేక సంచిక". జర్నలిజం ఆకాశంలో పౌర్ణమి, సాహితీ పూదోటలో వన్నెగుండి శ్రీ గోరాశాస్త్రి - వారిమీద చక్కని ఎడిటోరియల్‌తోబాటు శ్రీ పి. శ్రీనివాసశాస్త్రిగారి ప్రత్యేక వ్యాసం వుంది శ్రీ శాస్త్రిగారి సమక్షంలో పని చేసి, ఆయన ఇంటెలెక్ట్‌ని స్పృశించిన నవవకాశంతో వారిమీద చక్కని వ్యాసం రాశారు. ఎ. ఎల్. నరసింహారావు గోరాశాస్త్రి 'స్వతంత్ర'తని వివరించి రాశారు.

ఇంకా లేఖాసాహిత్యంగురించి శ్రీ కె. శ్రీనివాసాచార్యుల విశిష్ట రచన, మహమద్ హుసేన్‌గారి 'జాషువా కవితారీతి' వున్నాయి. శ్రీ స్వామిగారి 'దేవుళ్ళు' ఆలోచనకి పనికొచ్చే అంశమే! కె. మధుగారి ఆత్మపరిశీలన, పైడిశ్రీగారి రెండంచుల కత్తులు బాగా మెరిశాయి. కొనదగ్గ ఈ పుస్తకాన్ని కొనాలంటే-

కళాసౌరభం, తారానగర్ (బి హెచ్. ఇ.యల్.) దగ్గర, హైదరాబాద్-133 అని రాసి తెప్పించుకోండి.

ఆంధ్రప్రదేశ్ కవితా సాంస్కృతిక సంస్థ తెలుగు నవలా సాహిత్యంపై గోష్టి.
శ్రీ వీరేంద్రనాథ్, శ్రీమతి సి. ఆనందారామం, శ్రీ అంతటి నరసింహం,
శ్రీ ఇ. అయ్యపురెడ్డి, శ్రీ పోరంకి దక్షిణామూర్తి.
వెనుక వరుసలో శ్రీమతి మాదిరెడ్డి సులోచన, శ్రీ దేవానంద్, శ్రీ రవీందర్.



# అమృతాంజన్‌కే తెలుసు తల నొప్పి బాధ

అసలు తల నొప్పి అంటేనే భరించలేని బాధ. దాన్ని పోగొట్టుకోడానికి సుళువైన మార్గము. కొంచెము అమృతాంజన్ తీసుకొని కణతల మీద బాగా గట్టిగా నిమిరి పట్టించండి. వెంటనే తల నొప్పి తగ్గిపోయి హాయిగా వుంటుంది.

అమృతాంజన్ ఇతర మందులవలెగాదు. అమృతాంజన్‌లో చేరివున్న శక్తివంతమైన 10 ఔషధాలు అమోఘంగా పని చేసి రాసిన చోట పై చర్మ వల్ల అతి త్వరగా ఇట్టే నొప్పిని నివారిస్తుంది. ఏ అపాయం వుండదు. వికటించదు.

85 సంవత్సరాలకు పైబడిన ప్రసిద్ధి కల అమృతాంజన్ వొంటి నొప్పులకు. బెణుకులకు, జలుబులకు గొంతు నొప్పులకు కూడా చాలా అమోఘంగా పనిచేసి నివారిస్తుంది.

ఎప్పుడూ అమృతాంజన్ చేతికి అందుబాటుగా వుంచుకోటం మంచిది. ఎందుకంటే ఎప్పుడు అవసర మొస్తుందో చెప్పలేము.




**అమృతాంజన్**

శీఘ్రనివారిణి. నమ్మకమైనది. వికటింపనిది.

OBM 7652 TG

# ఘూటెక్కిన గంధక ధూపం

# శ్రీ చెరబండ రాజు

"వయస్సు సగం తీరకముందే అంతరించిన
ప్రజాకవి
నభస్సు సగం చేరకముందే అస్తమించిన ప్రభాకరవి"

బాలగంగాధర తిలక్ పోయినప్పుడు శ్రీశ్రీ రాసిన ఈ మాటలు చెరబండ రాజుకి అక్షరాలా వర్తిస్తాయి. కవిగానూ వ్యక్తిగానూ కూడా చెరబండ రాజుని మరిచిపోవటం కష్టం.

కష్టజీవులకోసం, కార్మికులకోసం, శ్రామికులకోసం, సామాన్యులకోసం-తన కలాన్ని అత్యంత శక్తివంతమైన ఆయుధంగా ఉపయోగించి.-ఈ వ్యవస్థపైనా, అవ్యవస్థపైనా, అన్యాయాలపైనా, అక్రమాలపైనా అంతంలేని సమరాన్ని ప్రకటించి, ఎన్నడూ వెన్ను చూపకుండా కడదాకా పోరాడిన వీరుడు చెరబండరాజు. ఈ పోరాట కాలంలో అతను పడ్డ బాధలూ అనుభవించిన కష్టాలూ అన్నీ ఇన్నీ కాదు. కుట్ర కేసులో ఇరికించారు. ఉద్యోగం తీసేశారు. మళ్ళీమళ్ళీ జెయిల్లో పెట్టారు. ఆరోగ్యం చెడిపోయింది; ఆర్థికస్థితి అసలే బావుండలేదు; సానుభూతిపరులు చాలామంది వున్నా అవసరమొచ్చినపుడు ఆదుకునేవాళ్ళు ఆట్టే లేరు. అయినా చెరబండరాజు తన నమ్మకాలు వదులుకోలేదు; అభిప్రాయాలు మార్చుకోలేదు; పట్టిన దారి విడవలేదు; ఎత్తిన కత్తి దించలేదు.

అంతటి నిజాయితీ గలవాళ్ళూ ధైర్యసాహసాలు గలవాళ్ళూ చాలా అరుదుగా వుంటారు. అందుకే చెరబండరాజు మంచికవీ గొప్పకవీ అయ్యాడు. దిగంబర కవిగా వెలుగులోకి వచ్చిన చెరబండరాజు ఆ తరవాత ఎంతో ఎదిగాడు. విప్లవ కవిగా వికసించాక అతని ఆలోచనలకీ అభిప్రాయాలకీ నిర్దిష్టమైన రూపం ఏర్పడింది; అతని రాతలు మరింత రాటుదేలాయి; ఎవరికోసం రాయాలో ఏమి రాయాలో ఏవిధంగా రాయాలో కూడా అతను బాగా తెలుసుకున్నాడు. మామూలు మనుషులందర్నీ చేరుకోవాలంటే మాటకంటే పాటకీ, వచనంకాని వచన కవితలకంటే జానపద గేయాలకీ ఎక్కువ శక్తి వుందని గ్రహించి-అరకొరగానే పాటలూ గేయాలూ రాసి విప్లవ కవులు చాలమంది సాధించలేని ప్రజాదరణ పొంది, తన కవితను సఫలమూ, సార్థకమూ చేసుకున్నాడు చెరబండరాజు.

కవిగానూ వ్యక్తిగానూ కూడా చెరబండరాజులో ఆడంబరాలు లేవు; కత్తులూ కల్మషాలూ లేవు. కవిగానూ వ్యక్తిగానూ కూడా అతను సామాన్యుడు కాడు. జీవితమంతా ఎన్నో పోరాటాలు జరిపిన చెరబండరాజు చివరికి మృత్యువుతోనూ పోరాడాడు. చెరబండరాజు వెళ్ళిపోయి అప్పుడే చాలారోజులయింది. తెలుగు పాఠకుల హృదయాల్లో అతను చల్లిన విప్లవ కవితా బీజాలు వాడిపోలేదు.

-డి. వెంకటరామయ్య

# రామ బాణం

సుఖసంతోషాలకి మార్గ దాయకాలేవిటో తెలుసా?



మనం చెప్పదలుచుకుంది సూటిగా కాకుండా డొంక తిరుగుడుగా చెప్పాలి!!



మనం ఏదిచేసినా అది మనకే లాభదాయకంగా వుండాలి!! పైగా ఎదుటి వాళ్ళకి మనం నిస్వార్థ పరులం అన్న అభిప్రాయం కలగ జేయాలి!!



ఏ పనైనా దూరం ఆలోచించి మరీ చెయ్యాలి!! అందువల్ల ఇతరులకు ప్రమాదం జరిగితే - అది మనవల్లగాకుండా - వాళ్ళ వల్లే జరిగిందన్న నమ్మకం కలిగించాలి!!






మనం వరసగా ఎన్ని
'తప్పులు' చేసినా అవి
పూర్తిగా "ఒప్పులే"నని గట్టి
ప్రచారం చెయ్యాలి!!




మనమీద ఓటరుల్లో
నమ్మకం పెంచాలి!!
నమ్ముతున్న వాళ్ళని నట్టేట్లో
ముంచటో అవసరం వస్తే
వెనుకాడంకూడదు!!




సుఖ సంతోషాలకీ
పెద్ద పదవులకీ మార్గ
దాయకాలు - యీ పద్ధతులే!
అర్థమయిందా?




అంటే ఈ మధ్య
రాష్ట్రపతి ఎన్నికలో
ఏ పద్ధతులవలంబించామో
అవే నన్నమాట!




# వెలిగిన జ్యోతి

సహజంగా మనిషి ప్రకృతిలో అహం భావం మొదటిదని చెప్పవచ్చు. అహం భావంచేత వచ్చే ఆలోచనతో తనని తాను పాడుచేసుకోడంతోబాటు చుట్టూ వున్న సంఘాన్నికూడా పాడుచేస్తాడు అజ్ఞానంతోనే-మంచిచెడు అన్నది ప్రసక్తి కాదు-విచక్షణ అనలు లేని స్థితి - ఇది చాలామంది మగవాళ్ళకి వుంది స్త్రీల లాగే-కానీ స్త్రీ అనే 'సబల' ముందు భార్యగా జీవిస్తేనే తనకి తాను ఓరూపు, స్థితి తెచ్చుకుంటుంది-ఆనకే దౌర్జన్యా లని ఎదిరించే ప్రయత్నం, ఫలం! ఐతే స్త్రీ ఏ స్థితిలోనైనా తనకి జరిగిన అన్యా యాలని సమీక్షించి ఎదిరించే స్థితి వుండాలి, రావాలీ అని కోరగం మానవ వికాసానికీ, క్షేమానికీ మంచిది-ఆరోగ్య కరం

ఇందులోని కథ-తలా ఒక అన్యా యానికి గురి అయిన కాంచన, బీనా దేవి, నర్మదల చుట్టూ జరుగుతుంది. తిరుగుబాటు తత్వం పూర్తిగా పెరిగిన కాంచన "పాత్ర"ద్వారా "ధర్" లాంటి దగుల్బాజీలకు సమాధానం దొరుకుతుంది.

కాంచన, బీనాదేవి, నర్మదలు చిక్కు కొన్న సామాజిక స్థితిగతుల్ని ప్రశ్నిస్తూ, చదువరులను ఈ పరిస్థితుల గురించి ఆలోచించమని అభ్యర్థిస్తారు రచయిత్రి.

నవలాప్రక్రియ గురించిన అవగాహన రచయిత్రికి సమగ్రమయితే, ఇలాంటి బలమైన కథావస్తువుల్ని పాఠకుల హృది యాలకు హత్తుకుపోయేలా చెప్పవచ్చు. ఆ ప్రయత్నం మల్లాది వెంకటసుబ్బమ్మ గారి రాబోయే రచనల్లో వుంటుందని ఆశిద్దాం

అలాంటి కథాంశంతో చక్కగా, ఆలోచనలని కదిలించి, మెరిపించేలా శ్రీమతి మల్లాది వెంకట సుబ్బమ్మగారు రచించారు. సరదాకీ, నిద్రపట్టడానికీ, ఏమీ తోచక చెయ్యటానికీ ఈ నవల ఉపయోగించకపోయినా, స్వేచ్ఛాభావా వేశాలని సమావేశపరిచేదిగా వుంది.


## వెలిగిన జ్యోతి

రచన

**మల్లాది సుబ్బమ్మ**

వెల : 12 రూ.లు

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :

**వికాసం**

9 ఎం. ఐ. జి. కాలని,

మెహిదీపట్నం, హైదరాబాద్-28







# హైదరాబాదు చిత్రపరిశ్రమకు మంచిరోజులు

జులై 18 హైదరాబాదు చిత్ర పరిశ్రమకి మంచిరోజు. ఆరోజున కృష్ణ



నిర్మిస్తున్న పద్మాలయా స్టూడియోకి, ప్రాథమిక సౌకర్యాల భవనసముదాయానికి ముఖ్యమంత్రి భవనం వెంకట్రామ్ శంకుస్థాపనచేశారు.

ముఖ్యమంత్రి చేసిన వాగ్దానాన్ని నిలబెట్టుకున్నారని, సంక్రాంతి నాటికి స్టూడియోను నిర్మిస్తానని నటుడు కృష్ణ చెప్పారు.

1956 నుండి చిత్రపరిశ్రమను మద్రాసునుంచి హైదరాబాదు తరలించాలనే ప్రతిపాదన వుంది. 26 సంవత్సరాలుగా చేస్తున్నకృషి ఈనాటికి ఫలించబోతుందని కొందరు సంతోషాన్ని వ్యక్తం చేశారు.

1964 లో హైదరాబాదువచ్చి స్థిరపడి, భారతదేశంలోనే గర్వించతగ్గ స్టూడియోగా అన్నపూర్ణా స్టూడియోస్‌ని నెలకొల్పి,' ఇక్కడపరిశ్రమ ఏనాటికైనా

నెలకొనక తప్పదు. కాకపోతే నేను బ్రతికి వుండగా కళ్లారా చూడాలని నా కోరిక అని ఎన్నో సందర్భాలలో నటుడు అక్కినేని నాగేశ్వర్‌రావు అనడం అందరికీ తెలుసు. ఆయన కలలు నిజమయ్యే రోజు దగ్గర పడింది.

అసలు చిత్రపరిశ్రమ ఎందుకు ఇక్కడకు రావాలని అనుకోవడం, మద్రాసులో వుంటే వచ్చిన నష్టంఏమిటి? అని వ్యాఖ్యానించేవారుకూడా వున్నారు. చిత్రపరిశ్రమ స్వరాష్ట్రానికి వచ్చినట్లయితే, పన్నుల్లో ప్రభుత్వానికి ఆదాయం, వందలమందికి ఉపాధి కల్పన జరుగుతుంది. ఈ దృష్టితో పరిశ్రమ ఇక్కడ స్థిరపడాలని ప్రభుత్వం ఆకాంక్షిస్తోంది. కొద్దిమంది నిర్మాతలవల్ల ఎందరో బ్రతకటానికి అవకాశం ఏర్పడుతుంది.

ఏమైనా ఇన్నాళ్ళకి 'కదలిక' ప్రారంభమైంది. ఇది హర్షించతగిన ప్రయత్నం. కృష్ణ స్టూడియోతో హైదరాబాదులో ఐదు ఫిలిం స్టూడియోస్‌లు వున్నట్టు. ఈ ఐదింటిలోనూ ఎన్నో చిత్రాలు నిర్మించవచ్చు. డబ్బింగ్, రికార్డింగ్ థియేటర్లు కూడా వున్నాయి. ఎఫ్ డి సి, వారు ఎడిటింగ్‌ను కూడా ఏర్పాటు చేస్తున్నారు.

కృష్ణ స్టూడియో పక్కన ప్రాథమిక సౌకర్యాల భవనాల (రికార్డింగ్, డబ్బింగ్ ఎడిటింగ్ వగైరా) నిర్మించటానికి సన్నాహాలు ప్రారంభమయ్యాయి.

ప్రసాద్, జెమినీ కలర్ లేబొరెటరీలు మరిరెండు నెలల్లో సిద్ధమవుతున్నాయి.

తారలకు ఇబ్బంది లేకుండా వుండటానికి జూబిలీ హిల్స్ ప్రాంతంలో ఒక ఫైవ్‌స్టార్ హోటల్‌ను నిర్మించమని

రాష్ట్ర పర్యటన అభివృద్ధి సంస్థవారిని ఆదేశించడం జరిగిందని ముఖ్యమంత్రి చెప్పారు.

"1982 చిత్రపరిశ్రమ అభివృద్ధికి శుభ సూచకంగా కన్పిస్తోంది" అని జులై సంచికలో మేము ప్రస్తావించిన విషయం పాఠకులకు గుర్తుండేవుంటుంది ఇది నిజమయ్యే తరుణం ఆసన్నమైంది. ముఖ్యమంత్రి శ్రీ వెంకట్రామ్ ఎంతైనా అభినందనీయులు

## విశ్వనాథ్ దర్శకత్వంతో సాగర సంగమం

ఈమధ్యకాలంలో ఆంధ్రేతర ప్రాంతాలలో కూడా అనూహ్యమైన గుర్తింపు సంపాదించిన దర్శకుడు కె విశ్వనాధ్. ఆయన దర్శకత్వంలో వచ్చిన "శంకరాభరణం", "సప్తపది", "శుభలేఖ" మొదలుగున చిత్రాలు విశ్వనాధ్‌ని దర్శకుడుగా సమున్నత స్థానంని కల్పించాయని చెప్పుకోవడంలో అతిశయోక్తి లేదు.

"శంకరాభరణం"తో విశ్వనాధ్‌లో వ్యక్తిగా, దర్శకుడుగా చాలా మార్పు వచ్చింది. ఆ విషయం ఆయన కూడా ఒప్పుకొంటారు.

సమాజ ప్రయోజనం దృష్టిలో పెట్టుకొని చిత్రాలు నిర్మించాలనే ధ్యేయం వున్నట్టు ఇటీవల జరిగిన కళాకృతి సంస్థ జరిపిన సన్మానంలో ప్రకటించారు విశ్వనాధ్ ఇవాల్టి రోజున వస్తున్న సెక్స్, హింస, నీచ ప్రవృత్తి చిత్రాలపట్ల ఆయన ఆవేదన వ్యక్తం చేశారు



## పాఠకులకు సీరియల్ కానుక

మీ అంతరంగాన్ని తాకి, మనస్సు విప్పే
మధుర మంత్రం మీకోసం....
ఆద్యంతం ఆనందం.

త్వరలో వస్తోంది కొత్త సీరియల్
శ్రీ వి. మోహన్‌కుమార్ రచన

ఎక్కడ వున్నది సస్యశ్యామలం....? కామెర్లు కమ్మిన కవుల కళ్ళల్లో ఉంది. కార్లల్లో తిరిగే దొరబాబుల జేబుల్లోని పచ్చనోట్లల్లో ఉంది. కబుర్లతో కడుపు నింపే నాయకుల వాగ్దానాల్లో ఉంది....!

VAMSEEKRISHNA PUBS.

# ఈ చరిత్ర ఏ సిరాతో...?

నైజాం: శ్రీ గీతాలక్ష్మి ఎంటర్‌ప్రైజెస్

నిజమే. సినిమా ప్రయోజనం కోసం ఉద్దేశింపబడిందే ఆయితే దురదృష్ట వశాత్తు దీన్ని కేవలం వ్యాపార సాధనంగా మార్చేశారు అయితే ఈ మధ్య చిత్రపరిశ్రమలో "న్యూవేవ్" కన్పిస్తోంది. ఇది హర్షించతగిందే

ఒక కమిట్‌మెంట్ ఉన్న దర్శకుడుగా విశ్వనాథ్ నిర్మిస్తున్న సంగీత, నృత్య ప్రధానమైన చిత్రం "సాగర సంగమం".

'శంకరాభరణం' చిత్ర నిర్మాత ఏడిద నాగేశ్వరరావు నిర్మిస్తున్న చిత్రం ఇది.

భారతదేశంలోనే సంచలనం సృష్టించిన కమల్‌హసన్ కథానాయకుడు, జయసుధ నాయిక నృత్యాలలో అనుభవం వున్న కమల్‌హసన్‌ని పెట్టుకోవడంవల్ల సంగీతంలోనూ, నృత్యాలలోనూ మరిన్ని ప్రయోగాలు చెయ్యటానికి అవకాశం వుంది.

పాటల రికార్డింగ్ ప్రారంభమైంది ఆగస్టు నుంచి షూటింగ్ జరుగుతుంది.

ఈ చిత్రాన్ని లక్ష్మీ ఫిల్మ్స్ శ్రీ వెంకట కృష్ణ ఫిలింస్‌వారు విడుదల చేస్తున్నారు.

## 3. రాఘవ తరంగిణి

చిత్రపరిశ్రమలో ఎన్నో ఏళ్ళ అనుభవం వున్న రాఘవకి అందులో లోతుపాతులుబాగా తెలుసు ఆయన నిర్మించే చిత్రాలు సాధారణంగా అపజయం కావు, ఎంతో పాపింగ్‌వున్న రాఘవ అంటికి స్నేహపాత్రుడు ఆయన నిర్మిస్తున్న తరంగిణి చిత్రం పూర్తయింది!

"ఇంట్లోరామయ్య-వీధిలోకృష్ణయ్య" చిత్రం ద్వారా తను పరిచయం చేసిన దర్శకుడు కోడి రామకృష్ణని ఈ చిత్రానికి కూడా దర్శకుడుగా నియమించాడు రాఘవ.

ఒక స్త్రీ జీవితంలో ఎదుర్కొనే అనేకమైన సంఘటనలకు తెరరూపమే ఈ 'తరంగిణి' అని రాఘవ చెప్పారు.

ఈ చిత్రాన్ని లక్ష్మీఫిల్మ్స్ వారు పంపిణీచేస్తున్నారు



'తరంగిణి' ప్రారంభోత్సవం శ్రీ రామోజీరావు, శ్రీ దాసరి నారాయణరావు, నిర్మాత రాఘవ, దర్శకుడు కోడి రామకృష్ణ, సుమన్, శ్యామలగౌరి, పూర్ణిమ.